# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి



సంపుటము 4 రాజమహేంద్రవరము 1-6-1981 సంచిక 15

## —* ఈ సంచికలో *—



16—6—81 సంచికలో ఉత్తరరామచరిత్ర - ఉపదేశ వైచిత్రి, సాహిత్యంలో శకుంతలాపాత్ర పరిశీలనము, పుట్టంబుట్టి తపసి, 'బాటసారి' వర్ణన వైశిష్ట్యం మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా :

సంవత్సరమునకు రు. 12—00.

అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము 4 | రాజమహేంద్రవరము 1-6-1981 | సంచిక 15


## నాచనసోముని - నవీన గుణములు


- 'భారతీప్రియ' శ్రీ సి. నీలకంఠంగారు.


ఆంధ్ర సాహిత్యమున కవిత్రయము తరువాత అంతటి మహాకవి నాచన సోముఁడు. సోముని రచనావిధానమును బట్టియు ఆశ్వాసాంత గద్యలను బట్టియు చూచినచో కవిత్రయముబాటలో పయనించినట్లు అవగత మగును. ఇతని ప్రతిభను గూర్చి 'యలికంబున నక్షి నిడాచిన' వాడని (త్రినేత్రునంతటి వాఁడని) చిన్నయసూరి మెచ్చుకొనుటయే కాక వ్యాకరణ విషయములో కవిత్రయముతో పాటు సోముని గ్రంథము గూడ పరమ ప్రమాణముగ గ్రహించుట విశేషము. సోముని రచనలను పలువురుకవులు తమ గ్రంథములలో నుదాహరించుటను బట్టి అవి ఆరు గ్రంథములని భావింపవచ్చును అవి

1) ఉత్తర హరివంశము
2) హరివిలాసము
3) వసంత విలాసము
4) ఆది పురాణము
5) హర విలాసము

పై గ్రంథములలో నొక్క 'ఉత్తర హరివంశము' దక్క తక్కిన గ్రంథములు లభించుట లేదు. ఈ గ్రంథ రచనను గూర్చియు, నితని కవితా గుణములను గూర్చియు పలువురు విమర్శకులు పలువిధములుగా నుల్లేఖించిరి. వారిలో వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, వేలూరి శివరామ శాస్త్రి, నడకుదుటి వీరరాజు పంతులు, విశ్వనాథ సత్యనారాయణ మొదలైన వారు కలరు

స్వేచ్ఛానువాద మార్గమున నితఁడు కూర్చిన హరివంశ కథలంతఁ గావ్య సౌందర్యమునకును భగవత్తత్త్వ నిర్దేశమునకును సమానస్థాన మున్నది. శ్రీకృష్ణతత్త్వమును సహజసుందరముగా వర్ణించుటను బట్టి భక్తిమార్గ తత్పరుడని తెలియుచున్నది. ఇతఁడు ఉత్తర హరివంశము పేర సంస్కృత ఉత్తర హరివంశములోని ఆఱు కథలను అనువదించెను అవి

1) నరకాసుర వధ
2) విప్రకుమార రక్షణము
3) శ్రీకృష్ణుడు కైలాసమున కేగుచు మార్గమధ్యమున ఘంటాకర్ణునకు ఇంద్ర పదవి నిచ్చుట.
4) పౌండ్రక వాసుదేవ కథ
5) హంస డిభకుల వధ
6) ఉషా కళ్యాణము.

ఇందు హంస డిభకోపాఖ్యానము చక్కనికథాసంవిధానముతో, సాహిత్య రసపోషణముతో. నవీనగుణములతో అలరారు చున్నది.

నవీనగుణములు :- కవిత్రయమువారు కథకు ప్రాధాన్యమియ్యగా నాచన సోముఁడు రసమునకు, శైలికి, స్వరూప వర్ణనలకు ఎక్కువ ప్రాధాన్య మిచ్చెను. ఇవియే ఇతని నవీన కవితా గుణములు. కథ చెప్పుటలో భావము, వస్తువు, రచన అను మూడు అంశము లుండును. భావము కంటె వస్తువునకు, వస్తువుకంటె రచనకు, చమత్కార విషయమునకు మొగ్గు చూపుట సోముని నవీనత హంసడిభకుల వేటలో వరాహవర్ణనము ఇట్టిదే

ప్రబల దంష్ట్రాగ్ర పర్యస్త ముస్తాస్తంబ
  జంబాల శబలవేశంత పంక్తి
ఘన ఘనాఘన నీల ఘనవన ప్రతిఘాత
  ఘన ఘూర్ణనావ భగ్న ద్రుమంబు
ఘురఘురారవ ఘోర ఘోణా ప్రఘాణవి
  ద్రాణచ్ఛదాచ్ఛన్న తాంత లతము
ఖనన ఖుళాత్కారి ఖురఖురోత్పాతత్రి
  హల్యధాత్రీ ధ్వస్తయవసరాజి
ఖేట భాటభాషణోద్భటాఖేటచటుల
కుటిల కటుకటాక్షేక్షణక్షోభ బధిర
మతిరభస భాసమాన యానాభిమాన
రోమవిక్రియా కులము వరాహకులము

(4.24)

ఇట్లే దుర్వాసుని వర్ణనము. హంస డిభకులకు మార్గమధ్యమున దుర్వాసా

శ్రమ మెదురైనది. ఆ మూని యతిగా నుంటుట వారికి నచ్చలేదు. అందుకే మూనిని హేయమైన భాషలో నవమానించిరి. కవి ఈక్రింది పద్యములో నచ్చతెనుగు పద్యమును రచించిన తీరు నడక అందముగా నున్నది.

కావిచీర ముసుగు కచ్చడంబును జూచి
బోడతలయు నిడుద బొట్టుఁ జూచి
గోచితోడి వెదురుఁ గోలయుఁ జిక్కంబు
గట్టియున్న బుఱ్ఱకాయఁ జూచి'
(4-42)

భావమును వస్తురూపమున వర్ణించుటకు ఉదాహరణము.

వడఁకు పన్నగరాజు పడగలమీద స
ర్వంసహాకాంత పేరణము సూప
నక్షత్రతతులూఁగెడు నుదయాస్తగిరులతో
నాకాశలక్ష్మి కోలాట మాడఁ
దెరలెత్తి సప్తసాగరములుఁ బొరలంగ
వరుణుండు గొండిలి పరిఢవింప
మొకముల చాయ వేల్పోక చందముగ నిల్చి
కమల సంభవుఁడు ప్రేంఖణ మొనర్ప
మంగలములోని ప్రేలాలమాడ్కిఁ జుక్క
లిక్కలిక్కడపడ దిక్కులెనిమిదియును
బగులఁ బాతాళతలము గుబ్బటిలఁ జెలఁగె
శౌరి పూరింప నప్పాంచజన్యరవము.
(4-216)

సోముని రచనలో శబ్దచమత్కారము హెచ్చు. అలంకారములు, జాతీయములైన సామెతలు నుడికారములు ప్రతి పద్యమునను ప్రయోగింపబడుచునే యుండును.

సామెతలు :-

1) 'వరుగతోఁ దాగరయు నెండవలసినట్లు' 4-54

2) చల్లకు వచ్చి ముంత దాఁచినగతి' 4-149

3) 'తవుడు దిని చచ్చువానికి విషము వెట్టువాఁడు వెఱ్ఱివాఁడు' (4-62)

4) వెదకం బోయిన తీవ కాలఁ దవిలెన్' (4-163)

నుడికారములు :-

1) మునుల లోపల నాలుక ముల్లువిఱిగె' (4-102)

2) పులిఁ గోల ద్రవేసినట్లు' (4-200)

3) 'మంగలములోని ప్రేలాలమాడ్కి' (4-216)

ఇట్టి వనేకములు గలవు. ఇంకా వివరములు కావలసినవారు యశోదారెడ్డిగారి పుస్తకములను పరిశీలింపుడు.

తరువాతి వసుచరిత్రాది విజయ విలాసాది ప్రబంధములకు మార్గదర్శకమైన చమత్కారశైలి సోముఁడు ప్రయోగించెను.

ఉత్తర హరివంశము :-
నరకాసురప్రాణ నాళోత్తరణకేళి
రణకేళి, జలకేళిరమణఁ జూపెఁ (4-124)
వసుచరిత్ర :-
మందయానము నేర్పు నిందిందిరాజీవ
రాజీవరాజ న్మరాళరాజి (3-28)
ఉత్తరహరివంశము :-
'అరిఁ గరమున నేఁదాల్చిన
నరిగరము నగేంద్రధీరుఁడయినం జెడఁ దే
యరిదిరమై నన్నడుగుట
యరిదిరమై కాభిలాషులగు నృపతులకున్'
(4-162)

విజయవిలాసము :-
'వెస లలనామణి బంగరు
వెసలల దొంతరలు డించి వినయముమదికిం
బొసఁగఁగఁ గంకణ రవములు
పొసఁగఁగ, నారసి రసాన్నములు
వడ్డించన్' (2-152)

అలంకారములు :-
'వెలిదమ్ములో తేఁత వెన్నెలోయమృతమో
కన్నులో చిరునవ్వో కనికరంబో'
(4-138)

'కరటిఘటాకోటి కట నిర్గళన్మదా
సారంబు దొలుకారుఁ జేర బిలువ'
(4-223)

యుద్ధవర్ణనలు : సోముని యుద్ధవర్ణనలు తిక్కన యుద్ధవర్ణనలకు దీటుగా నున్నవి. వర్ణన విపులముగా నున్నను విసుగు జనింపకుండ ఆలంకారికముగా నుండును.

'వడఁకు పన్నగరాజు పడగలమీదఁ స
ర్వంసహాకాంత పేరణము సూప
(4-216)

'కరటి ఘటాకోటికట నిర్గళన్మదా
సారంబు దొలుకారుఁ జేరబిలువ'
(4-223)

హంసడిభకుల దుర్మరణమును సోముడు బహుచమత్కారముగా వర్ణించెను.

'నారయొల్లి నీడన నరలోక మేలుదు
ననులావు వఱితి పాలయ్యెనన్న!'
(4-300)

ఈ విధముగా నవీన గుణములతోను, విసువు జనింపని (యుద్ధ) వర్ణనలతోను, నాచన సోముఁడు హంసడిభకోపాఖ్యానమును రచించెను.

—...—

# అత్యద్భుత శతావధానులు - వేంకటరామకృష్ణులు

- శ్రీ పాలంకి లక్ష్మీదేవి, ఎం. ఏ

'అవ' అను ఉపసర్గతో కూడిన ధాతు - 'ధారణ పోషణయోః' అను ధాతువునుండి అవధాన శబ్దమేర్పడినది. అగ్నిధాన మొనర్చువారవధానులు. తొలుత నీపదము వేదపారశులకు వాడబడి తరువాత సాహిత్యమున ప్రవేశించినది. అష్టావధానము అధిక ప్రాచుర్యము నందినది. నేత్రావధానము, నాట్యావధానము చేయువారరుదుగా కలరు ఆధునిక యుగములో మాడభూషి వేంకటాచార్యులు, తిరుపతి వేంకట రామకృష్ణకవులు, వేలూరి శివరామశాస్త్రి ప్రభృతు లవధానముల నొనర్చి ఖ్యాతి గాంచిరి. వేంకట రామకృష్ణుల యవధానములను గూర్చి తల స్పర్శముగా పరిశీలించుట ప్రస్తుత వ్యాసోద్దేశము.

వేంకట రామకృష్ణులలో ప్రథములు ఓలేటి వేంకట రామశాస్త్రిగారు, ద్వితీయులు ద్వివేది రామకృష్ణశాస్త్రిగారు. వీరిరువురును చర్ల నారాయణశాస్త్రిగారి తోడ సాహిత్యము నభ్యసించిరి. రామకృష్ణశాస్త్రిగారు తమ విద్యాభ్యాస కాలముననే గురువులయు, సతీర్థ్యులయు కోర్కెపై స్వగ్రామ మగు కాకరపఱ్ఱులో తమ మొదటి యష్టావధానము నొనర్చిరి. అందు శ్రీకృష్ణుని వర్ణించుచు వీరు చెప్పిన సీసపద్యము వీరప్పటికే పద్యరచనలో నిష్ణాతు లని విశదపరిచుచున్నది. ఆ పద్యమిట్లున్నది.

'చిన్నారి పొన్నారి చిన్ని వెన్నెలగుత్తి
చెన్నొందు చన్నెడి మోము చెల్వువాని
మాలమేలము జేయు వాలుగన్నులవాని
కొమరారు నల్లని కురులవాని
నీలమేఘము డాలు నేల జాలిన మేని
వన్నెవాని మేలిచిన్నెవాని
గెందామరల డాలు గేలిసేయగ జాలు
చాయ లీనెడు నంజదోయి వాని
వల్లవీ పల్లవాధరా ప్రాణనాథు
నందనందను బూజింతు డెందమందు
నాదగు వధానమును గని మోద మంది
యున్నవారికి సంపద నొసగు కొఱకు.

తరువాత వీరే తమ మాతామహస్థలమగు పల్లిపాలెములో రెండవ యష్టావధాన మొనర్చిరి సభ్యులు వారిని పురుషరూపంబు నెత్తిన సరసిజాత సంభవుని రాణి' యని శ్లాఘించిరి.

వేంకటరామ కృష్ణులు సాహితీక్షేత్రమున పాలివ్యవసాయము మారంభించిన తరువాత పీఠాపురము సంస్థానములో మొదటి శతావధానము నొనర్చిరి. అందు పృచ్ఛకులు ముప్పది యిద్దరు మాత్రము లభించిరి. నూరోక పాదమును జెప్పిరి. వేంకట రామకృష్ణులు కీర్తిశాలులై 1909 వ సంవత్సరమున పీఠికాపురి కరిగిరి. తమ ఆశుకవిత్వమును, అవధాన శక్తిని, పాండిత్యమును చూపి రాజసభలో సమ్మానమునంద వలె నని వారి డెందము లువ్విళులూరు చుండెను. వీరు ప్రభువునకు పంపిన పద్యరూప మగు విజ్ఞాపన పత్రికలో తాము చేయబోవు అవధానమును గూర్చి యిట్లు చెప్పిరి.

'... ... అయ్యది చూడ, జాల న
ద్భుత మెటులన్న బృచ్ఛకుడు
దోచిన వర్ణన గోరుచుండ నా
చితిగల సత్కవుల్వినుతి
సేయగ సోయగమైన పద్యముల్
శతి మొకగంటలో సలుప
జాలుదు నాళువు జూచి నాదుపాం
డితి నెఱుగంగ వచ్చును'

అని వేంకట రామశాస్త్రిగారనగా
'నాలుగు నైగు గంటలు ది
నంబున పంబనిసేయ నెంతయుం
దాలిమితోడ నీశతవ
ధానము మూడుదినాలు పట్టు నీ
కాలము లోపలన్ వినుగ
గల్గునమాపను మాట గాన భూ
పాలక యాలకింపు మొక
పద్ధతి జేసిన వారమిత్తఱిన్,

అని రామకృష్ణశాస్త్రిగా రనిరి. ఇంకను వీరిట్లనిరి-

'చేయుటకొక్క గంట యది
చెప్పిన చొప్పున దప్పకుండగా
వ్రాయుటకొక్కగంట సరి
వారలలో నవధాన పాండితీ
స్థేయత కొక్కగంట యరు
దెంచిన పెద్దల గారవింప నొం
డో యరగంటయో వ్యవధి
యుండవలెన్ ..'

ఇట్లు శతావధానమును నాల్గుగంటలలో సలుపగల మనిరి. అవధానమును గూర్చి

'ధారణదప్పరాదు కవి
తారస మాధురి పోవరాదలం
కారము లేగరాదు కవ
గానపశబ్దము లుండరాదు వా
గ్ధోరణి యాగరాదు ... ...'

అనిరి. రాజానుమతితో నీయువకవులు మార్చి 13 వ తేదీని శతావధానమును 4 గంటలలో నొనర్చి మాటనిలుపుకొన్నవారైరి. అవధానానంతరము ప్రభువు కోరిన పద్యముల నన్నింటిని ధారణచేసి చదివిరి అందలి వైచిత్ర్యమునకు సంతసించి ప్రభువద్దానిని 'అత్యద్భుత శతావధాన' మని శ్లాఘించిరి. స్వల్పకాలములో చేయదగిన దగుట వీరిందు సీసము వంటి పెద్ద పద్యములను కోరవల దనిరి.

'సందర్భంబును జూచి చెప్పెద మెడన్
శార్దూల వృత్తంబు మా
కందైనం దగి యున్నచో నపుడు మ
త్తేభంబు నిర్మింతు మా
నందం బందిన జంపకోత్పలములన్
సంధింతు మీ ప్రక్రియన్

గండం బొక్కడ గీత మొక్కడను వ
  క్కాణింతు మిచ్ఛాగతిన్'

అనిరను; శ్లోకము, కవిరాజ విరాజితము వంటివాని నక్కడక్కడ చెప్పిరి. పృచ్ఛకులు కోరకున్నను తమ యభిమాన విద్యయగుట రెండుమూడు సంస్కృత పద్యములను జెప్పిరి.

వేంకట రామకృష్ణుల యవధానములను గాంచిన సూర్యరాయ ప్రభువు వారి ఆశుకవితకు, అవధాన శక్తికి, ఉభయ భాషా పాండిత్యమునకు మెచ్చి వారిని ఆస్థాన కవులనుగా జేసెను. శతావధాన, శతవిధానముల ద్వారమున నీకవులు తమ ప్రతిభాసంపత్తులను రాజసభలో వెల్లడించిరి.

పీఠికాపురాస్థాన కవు లగు రామకృష్ణులు దసరాపండువులలో నొక శతావధానము నొనర్చిరి. అందు లక్షణవిరుద్ధముగా జెప్పుకవిని గూర్చి

'ప్రాసంబున్ యతియున్ విరుద్ధగతి శ
  బ్దంబున్ బ్రయోగించుచున్
మీసంబుల్ వడి వెట్టి మానుప మమే
  మే యంచు నెందున్ దుర
భ్యాసంబొప్పగ నుండు వారు కవులై
  పద్యంబులం జెప్పినన్
వాసింగన్న కవీశ్వరుల్ సభలలో
  వర్ణింతురే వారలన్.

అనిరి. ఈ శతావధానమును 10 గంటలలో నొనర్చిరి. రామకృష్ణశాస్త్రిగారు ద్విగుణీకృతాష్టావధానము నొనర్చిరట. దీనిని గూర్చిన వివరము లేమియు లభ్యము కాలేదు. నిషిద్ధాక్షరిలో వీ రసమాన ప్రతిభులు. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి రచన (అనుభవాలు-జ్ఞాపకాలు) యీ విషయమున కద్దము పట్టుచున్నది. మూడు భాషలలోని మూడు పద్యములను కలిపి వైచి వ్యస్తాక్షరి ఈయగా హేలగా జెప్పిన ధీమంతులు వీరు. వీరి యవధానములలో చతురంగ మొక యంశము. 17-3-09 తేదీని కోటలో నొనర్చిన అష్టావధానము నుండి కొన్ని అంశముల నుదాహరించుచున్నాను.

నిషిద్ధాక్షరి - పేరి పేరయ్యశాస్త్రిగారు నిషేధించిరి.

స మాం పాతు లస ద్వక్త్రః
ధీమాన్ సత్యగురు స్సమః।
  యం సుధాన్నా స్తథా చాన్యే
  యయు ర్మోక్షం నవం నతాః॥

నిర్దిష్టాక్షరి - పురాణ పండ మల్లయ్యశాస్త్రిగారు నిర్దేశించిరి

  విరే (జే) రాజ (రా) టోస్యం
  న (వా) నం దో మహద్ధ (నమ్)
  దత్త్వాద్య (స) దోర్భ్య హో (దం) య
  శ్చకాశే భూ (త) లే భృశమ్.

సమస్య :-

కుండను కొండ సొచ్చె నిది
  గో యని పల్కెను విస్మయంబుగన్.

వేంకట రామకృష్ణు లిట్లు పూరించిరి.

కొండలు రేఁగి లోకముల
  గుండెలు నేయుచు నుండఁ జూచియా
ఖండలుఁ డుద్ధతుండయి య
  ఖండ పరాక్రమ మొప్ప రెక్కలన్
జెండగ డంగుటం దెలిసి
  శీతనగాత్మజుఁ డబ్ధివజ్రిరా
కుండను కొండ సొచ్చె నిది
గోయని పల్కెను విస్మితంబుగన్.

15-7-09 ని కోటలో నొనర్చిన అష్టావధానములో నీయబడిన సమస్య :

  రాతికిఁ గోఁతి పుట్టె రఘు
    రాముని కైవడి సీత కైవడిన్.

పూరణము -

ఖ్యాతి యొసంగ నంజనకుఁ
  గల్గిన శ్రీ హనుమానుఁ జూచి సం
ప్రీతిని జెంది దేవతలు
  పేరిమిఁ జెప్ప కొనంగ సాగిరీ
భూతల మందు రావణుని
  బొల్పడఁగింపగ విష్ణు డంధకా
రాతికిఁ గోఁతి పుట్టె రఘు
  రాముని కైవడి సీత కైవడిన్.

వేంకట రామకృష్ణుల నూతన ప్రక్రియ శతవిధానము. వీరు ప్రభువు కోరికపై ప్రహ్లాదచరిత్రమును నూరు పద్యములలో గంటలో చెప్పిరి. అంతేకాక ఇష్టదేవతాస్తుతి, సుకవిస్తుతి, కుకవినింద మున్నగు ప్రబంధ లక్షణముల నప్పటి కప్పుడు కల్పించిరి ఫలశ్రుతిని గూడ చెప్పిరి. దీనికి వీరు శతవిధాన మని పేరిడి, తామే ఆ ప్రక్రియా ప్రారంభకు లగుటను కవులకును పృచ్ఛకులకును కొన్ని నిబంధనముల నేర్పరచిరి వీరి తరువాత నీ ప్రక్రియను చేబట్టిన వారెవ్వరును గానరారు. వీరి . రెండవశత విధానము రామాయణము.

అల్లసాని పెద్దన మున్నది రెండుపాదముల ఉత్పలమాలిక నాశువుగా జెప్పగా మెచ్చి కృష్ణరాయలు గండపెండేరమును బహూకరించెను. వేంకటరామకృష్ణులు భారత కథను నూరుపాదములలో చంపక మాలా వృత్తములో 'ర' ప్రాసముతో నాశువుగా నొడివిరి. ఇది శతప్రాసము.

వేంకట రామకృష్ణు లాస్థాన ప్రవేశ మొనర్చిన కొలదికాలముననే అవధానములు చేయుట మాని వైచిరి. ప్రభువునకు వాని యందలి ప్రీతి తగ్గియుండ వచ్చును. వీరాస్థాన కవు లగుట చే వేరొండు తావున కరుగుటకును అవధానము లొనర్చుటకును అవకాశము లేక పోయినది. వీరొనర్చిన అవధానములలో కొన్నింటిని గూర్చి మాత్రమే మనకు తెలియుచున్నది.

వేంకట రామకృష్ణులవలె నాల్గుగంటలలో శతావధానము నొనర్చిన వారి అవధాన చరిత్రలో మరొకరు గానరారు

అతద్భుత శతావధాను లగు వేంకట రామకృష్ణులు అగ్రశ్రేణి అవధానులలో అవశ్యము పేర్కొనదగినవారు. ఆంధ్ర సాహితీ లోకమున మరవరాని వారు.

# నాటకరంగంలో విశ్వనాథ వైశిష్ట్యం

- కె. వి శ్రీరంగనాయకి ఎం. ఏ.

సాహిత్య ప్రపంచమున ఈ శతాబ్దము వినూత్న శోభల వెలార్చినది. ఈ శతాబ్దారంభము నుండి వివిధ సాహిత్యప్రక్రియలు సాహిత్యమున నుద్భవించి నాటక వికాసమును గావించినవి. షుమారు 1907 ప్రాంతము నుండి నాటకరచనము మిగుల చురుకుగా సాగినది. 1930 to 40 మధ్యభాగమున కొంత కాలము నాటక రచనము స్తబ్ధత పొందినను మరల ద్విగుణీకృతోత్సాహముతో వివిధ ప్రక్రియలలో సాగినది. ఈ సాగిన నాటక రచనమును పెద్దలు స్థూలముగా 8 రకములుగా విభజన చేసియున్నారు 1. భావవైవిధ్యము. 2. రచనా వైవిధ్యము. 3. ప్రయోగ వైవిధ్యము. వీనిలో కొన్ని చారిత్రకములు, సాంఘికములు, పౌరాణికములు, దేశభక్తి ప్రధానములు, సంఘ సంస్కరణములు, తిరస్కరణములుగా వ్యాప్తిలోనికి వచ్చినవి

ప్రాచీనాలంకారిక నాటకలక్షణములను. నాటకములను ఆపోసనబట్టి ఆంగ్లేయుల నాటక ప్రణాళికల నవగతము చేసుకొని సంస్కృతాంధ్రాంగ్ల సాహితీ పట్టభద్రులగు కొందరు మహాకవులు తమ నాటకముల కొన్ని కొన్ని నూతనప్రయోగములను గావించి నాటక రంగమున వైవిధ్యమును నెలకొల్పినారు. అట్టి వారిలో శ్రీ విశ్వనాథ, దువ్వూరి, రాయప్రోలు, తల్లావజ్ఝల మున్నగువారు ముఖ్యులు కాని యాంధ్రుల దురదృష్టమేమోగాని ఆనాటకములు ప్రదర్శన రంగమున నేడంతగా రాణించుటలేదు. అవి కేవలము సాహితీ ప్రియంభావుక లగు రసజ్ఞశేఖరులకే నిర్ణీతములు.

విశ్వనాథ వారి నర్తనశాలను తెనాలి నాటక పరిషత్తువారు ప్రదర్శించినారు. అది అంత బాగులేదని ప్రసిద్ధి.

ఈనాటక రచనము కవి కత్యంత క్లిష్టము. మిక్కిలి గౌరవకరము కూడ నదియే. నాటక రచనము గావించినపుడే కవి సాహిత్య నిష్ణాతు డగును. 'నాటకాంతం హి సాహిత్యమ్' అని కదా! ఆర్యోక్తి. అట్లే నాటకపఠనానంతరము గాని విద్యార్థిత్వము కూడ సఫలముగాదు.

నాటకము దృశ్యకావ్యము. శ్రవ్యకావ్యములకన్న దృశ్యకావ్యములు రమ్యములని పెద్దలందరూ వాక్రుచ్చిరి గదా! ఈ దృశ్య కావ్యమును దర్శించి పండితునితో పాటు పామరుడు కూడ ఆనందమును పొందగలడు. కాని యుద్ధాది వర్ణనములింకు ప్రదర్శన కసాధ్యములు. కావున కవి వానిని అత్యంత శ్రద్ధతో వంకాంకముల మధ్య ప్రవేశక విష్కంభముల ద్వారా సూచన సేయును.

ఈ నాటకములు 10 రకములనియు వానికి వేరువేరు లక్షణములుగలవనియు ధనంజయుడు దశరూపమున జెప్పియున్నాడు కాని నవ్యులదృష్టిలో నాటక ప్రకరణము లన్నియు తుల్యములుగా పరిగణింపబడుచున్నవి. ఈ విశ్వనాథవారు రచించిన నాటకములు యందత్యంత ప్రచారము పొందియున్న నాటకములు చతుర్వేదముల వంటి నాలుగు నాటకములు. 1. నర్తనశాల. 2. వేనరాజు 3. త్రిశూలము 4. అనార్కలి.

ఈ నాలుగు నాటకములే కర్తృకము లైనప్పటికినీ ఒక కోవకు చెందినవి కావు. భిన్నభిన్నములు. ఒకడు కేవలము పౌరాణికము. ఒకడు కేవలము వీరశైవము. ఒకడు బౌద్ధము. ఒకడు మాహామ్మదీయము. ఈ భిన్నములైన నాటకముల రచనము ఒక కవి చేయుట మిక్కిలి విచిత్రము. విశేషము. దీనిద్వారా కవికిగల వైవిధ్యము సువ్యక్తము.

ముందుగా 'నర్తనశాలను' సమీక్షింతము. ఇది తొమ్మిది అంకములు గల మహానాటకము. ఈనాటకము నందు పాత్రల సంఖ్య మితముగా నున్నది. అంగిరసము వీరము. అంగముగా శృంగారము పరిపుష్టమైనది. ఇందు 5 పురుష పాత్రలు. 5 స్త్రీ పాత్రలు. ఈ నాటకమునకు మూలము విరాటపర్వము నందలి కీచకవధ ఘట్టము. ఆ ఘట్టము నందలి కథను కొన్ని మార్పులు, చేర్పులుచేసి నాటకముగా రూపొందించినారు శ్రీ విశ్వనాథ. ఇందు పాండవు లందరూ లేరు. ధర్మప్రతిష్ఠాత కంకుభట్టు. వధకు మూలకారకు డగు వలలుడు, తంత్రీపాలుడు. ఇక స్త్రీలలో ముఖ్యపాత్ర సైరంధ్రి. ఇందలి చమత్కారము పల్లవి కొంత కథ నడపుట.

ఈ నాటకము నందు నాయకుడు కంకుభట్టు. ఈతని పాత్ర నాటకమున హెచ్చుగా లేకపోయినా నాయక స్థానమును పొందియున్నాడు. అట్టిమహాలక్షణములు, ధర్మప్రతిష్ఠాపన శక్తి, యీతని యందు కలవు. ఇక ప్రతి నాయకుడు కీచకుడు. ఈ నాటకము నందు ప్రాచీనాలంకారిక నాటక లక్షణములతో పాటు నవీనలక్షణములుకూడ మిళితములైయుండుట విశేషము.

ప్రాచీన కావ్యలక్షణములలో ప్రతి నాయకునిపాత్ర లోకభీకరముగా వర్ణించబడును. కానియిందు మాత్ర మట్లు లేదు. కీచకుడు సింహబలుడు. ఈతని భుజా

గ్రంథములపై విరాట రాజ్యము నిలబడియున్నది. విరాట రాజు కేవల నామమాత్రుడే. సహృదయుడు బలపరాక్రమవంతుడు, సరసుడు, రసికుడు నగు కీచకుడు సైరంధ్రిని తొలి చూపుతోడనే మేలిజాతి స్త్రీ యని పసిగట్టినాడు. ఆమె సుందరి మోహమతిశయించిన కీచకుడు ఆసౌందర్యరాశిని వర్ణించిన తీరు మిగుల హృద్యము. కీచకుని దురదృష్టము ద్రౌపదిని గుర్తెరుంగకుండుట. గుర్తెరుంగుట కవకాశమును లేదు.

విరాట రాజు బావమరది యగు కీచకుని ధీరోద్ధతలక్షణములు గల ప్రతినాయకునిగా చిత్రించినారు కవిసమ్రాట్టులు. ఈతనికి సైరంధ్రియందు కామవాంఛ మిక్కుటమైనది. తుదకదే మృత్యువుగా పరిణమించి ప్రాణము లపహరించినది. 'రాజానో బహు వల్లభాః' అని కదా! పెద్దల సూక్తి. రాజునకు బహువల్లభత్వము దోషము గాదు. కాని కీచకుని కామము అస్థానపతిత మగుట వలన మహాపాతిత్యమై మృత్యువుగా పరిణమించినది. కాని యిందు శ్రీ విశ్వనాథ చేసిన కొన్ని మార్పులు మిగుల హృద్యములు.

ఇందు పల్లవి పాత్ర చాల చిత్రముగానున్నది. ఆమెయు నొక పరిచారిక. ఆమె కీచకుని హృదయము నెరిగినది. కీచకుడు సైరంధ్రితో మాటాడునపుడు సైరంధ్రిని గూర్చి మరీ మరీ అడుగుటచే సుదేష్ణ ఎంత వలదనుకొని సంభాషణమును మార్చుచున్నను చెప్పక తప్పలేదు తుదకు ఆమె సామాన్య పరిచారిక యని మాత్రము చెప్పినది. అట్లయిన కోపముతో, ఛీ! ఈమె పరిచారిక యను భావముతో విముఖుడగునేమో యని. కాని యట్లు జరుగలేదు. ఆమెను తన గృహమునకు పంపుమని అక్కనడిగినాడు. అక్క నీకీ పరదారాభిగమనము తగదని వారించినది. ఆమెకు ఐదుగురు భర్తలు గలరు. వారు సామాన్యులు గారు. గంధర్వులు. అని వెరపును గల్పింప ప్రయత్నించినది. కీచకుడు వినలేదు తుదకు విసిగి అంతఃపురమునకు పోయినది.

శిరోవేదనతో బాధపడుచున్న సుదేష్ణ యొద్దకు పల్లవి వచ్చినది. సంభాషణ మధ్యమున సుదేష్ణ ఈ రోజు నాకు తల నొప్పిగా నున్నదనగా పల్లవి కాదు! అది నీవు అన్యాయముగా కీచకుని నిందించుట వలన కలిగిన బాధ యని చెప్పినది. ఇట్లు చెప్పించుట ఒక విశేషము. అనగా కీచకుడు న్యాయమూర్తి. న్యాయము గల వారి నన్యాయముగా దూషించినచో ఇట్టి కష్టము సంభవించునని పల్లవి సూచన చేసినది. అంతలకు సుదేష్ణ అయిన కావచ్చునని యొప్పుకొన్నది.

ఇక ఈ పల్లవి కీచకునితో ఈ రాత్రి కేను సైరంధ్రి మీ గృహమునకు వచ్చునట్లు చేయుదునని మాట నిచ్చినది. ఈ మాటను వ్యర్థము చేయలేదు. తన తెలివినంతను ప్రదర్శించినది. పానీయమున మత్తు పదార్థమును గలిపి సుదేష్ణ కిచ్చినది. దానిని త్రావి సుదేష్ణ ఒడలెరుగని నిద్ర పొందినది. ఆమె మత్తులోనున్నపుడు శిరోవేదన నుపశమించుటకు కీచకుని యింటియొద్దనుండి పానీయము కలదని తెచ్చుటకు సైరంధ్రి సంసిద్ధముగా నున్నదని చెప్పినది. మత్తులో సుదేష్ణ సైరంధ్రిని పంపుటకు ఒప్పుకొన్నది. సైరంధ్రి దగ్గర 'మహారాణి యాజ్ఞాపించినది. పోక తప్ప'దని చెప్పినది. సైరంధ్రి కిప్పుడు సంశయ మేర్పడినది. ఏమి! తన్నవమానించిన దుష్టుని గృహమునకు తాను పోవలసినది. పోయిన ఒక ప్రమాదము పోకున్న మరియొక్క ప్రమాదము రాణి శిరోవేదన మధిక మగుచున్నది. దాని కౌషధ మిదియే. అయినను మహారాణి యాజ్ఞ పాటింపక తప్పదు. అట్లు చేయనిచో భర్తల ధర్మమునకు హాని కలుగును. మరణము సంభవించినను యజమానురాలి యాజ్ఞ శిరసావహింపవలెనని యనుకొన్నది. సుదేష్ణ పల్లవిగా భ్రమించి సైరంధ్రి వెళ్ళినదా? అని ప్రశ్నించినది. సైరంధ్రికి నిశ్చయజ్ఞానము కలిగినది. పల్లవిని పాత్రయిమ్మని కీచకుని గృహమునకు పయనమైనది. కాని చీకటులు క్రమ్ముట, చినుకులు, ఉభయ కరతమము కీచకుని హృదయమునకు ప్రతీకగా చిత్రించుట విశ్వనాథ వైశిష్ట్యము.

ఈ పల్లవి పాత్ర మూలము నందు లేదు. భారతమున సుదేష్ణయే చెప్పి పంపినది. కాని రాజ్ఞిని మాట తప్పించుట కిష్టములేని విశ్వనాథ పల్లవిని కల్పించినారు. ఇపుడు రాజ్ఞి ప్రారంభమున పరపురుషుని గృహమునకు పంపనని చెప్పినమాట వ్యర్థము కాలేదు. మత్తులోనున్న సుదేష్ణ ఊకొట్టుట సహజము.

కీచకుని యింటికి సైరంధ్రి వెళ్ళునరికి రెండు జాముల ప్రొద్దు పోయినది. అంతకు పూర్వమే యూరిని మిత్రుడు వెళ్ళినాడు. ఆతడు శారద్వతుడు. ఈతడు ఇంచుమించు ప్రాచ్యనాటకము లందలి విదూషకుని వంటి వాడుగా గోచరించును. సైరంధ్రిని గాంచి కీచకుడు మోహపరవశుడై తత్తదనుగుణమైన సంభాషణమును ప్రారంభింప సైరంధ్రి బెదరిన లేడి పిల్లవలె 'మద్యమును త్రాగగా పోయింపుడు' మా సోదరి శిరోవేదనమున బాధపడుచున్నదని మాత్రము పలుకును. అతని ప్రవర్తనము మితిమీర ఆమె వీధి వెంట పరువెత్తును. ఈ పరువెత్తు సైరంధ్రి మధ్యలో ఉత్తరను కంకుభట్టును గాంచును. అచ్చట సైరంధ్రి, కంకుభట్టు గావించిన సంభాషణము చాల చిత్రముగా నున్నది

ద్రౌపది పరాభవమును గూర్చి ఉత్తర మిగుల ఖేదము నొంది కంకుభట్టున

అభ్యర్థించినది. 'ఒకరాజ పురుషుడు ఒక పతివ్రతా తిలకమును ఇంతకుముందు తరుముతూ మానభంగము జేయయత్నించి నాడు శిక్షింపు' మన్నది. అంత ఆతడామె పేరేమన రాజసభలో పేరు చెప్పరాదనినది అచ్చట యథార్థముగా నున్నది కంకభట్టు, ఉత్తర, యిర్వురే. కంకభట్టున్నచోటే సభయని యుత్తర చెప్పినది. అంతట నామెయే అభ్యర్థింప వలెనను చుండగా సైరంధ్రి ప్రవేశించుట సముచితముగా ప్రాచీన నాటక మర్యాదను పాటించినది.

ఇచ్చట వీరిరువురి సంభాషణము ఉత్తరకు మరీఆశ్చర్యమును కలిగించినది.

'యువతీ! ఏలఅట్లు చెదవు ?'

'నేను మహాపదలో నుంటిని. నాపతు లగు గంధర్వులతో వైర పెట్టుకొను చున్నాను'

'స్త్రీలు ఎంతటి మహాపదలోనున్నను నలుగురిలోనికి రాజెల్లదు. నీకు శత్రువులు లేరా? వారు నిన్ను గుర్తుపట్టెదరు' పురుషులతో నెదిరి మాటాడుచున్నావు. నీవు పురుషు లన లెక్కలేదా !'

'ఔనౌను. ఒకరు స్త్రీ, ఒకరు జూదరి. ఒకరు వంట వాడు. ఒకరు పశువుల కాపరి.'

నాట్యకత్తెవలె చిందులు త్రొక్కుతున్నావు'

'నాభర్త నటుడు.' అని యావేశముతో జూదరి భార్య ... అని నిష్క్రమించును.

వీరి సంభాషణములో పరాభవము పొంది తోకత్రొక్కిన త్రాచు వలె విజృంభించుట ద్రౌపది పాత్ర యందు సువ్యక్తము. కాని అజ్ఞాత వాసమ యను పూర్తి కాజొచ్చినది. ఇటులం బయట పడిన ప్రమాదమును జాగరూకత ధర్మజుని సంభాషణమునందు స్పష్టపరచినారు శ్రీ విశ్వనాథ.

సంకేత స్థలముగానున్న నర్తనశాలకు బోవు కీచకునితో దాసి మాటాడు సందర్భము నందును జరుగ బోవు కీచకుని మరణమును సూచ్యార్థ సూచనము చేసినారు. 'దాసినే నీనాడు మనస్ఫూర్తిగా మిమ్మలంకరింప వచ్చితి' ననగా కీచకుడు 'రేపు చేయరాదా' అనెను.

దాసి - ఇక నా కాయోగ్యత ఎక్కడిది?

కీచ :- ఎందు చేత!

దాసి :- ఇదియే నా కడ సారిచూపు. దాసి యుత్తర వారింటికి పోవు మాట అటుంచి యథార్థముగా అది ఆమెకు కడ సారి చూపే. ఇందు కీచకుని మరణము స్పష్టముగా తొంగి చూచు చున్నది.

భారతము నందు లేని కొన్ని విచిత్రము లిందు గలవు. గంధర్వులందరూ విజృంభించి నర్తనశాల కొంత భాగమును దగ్ధము చేసిరి. అని యూరిలో పుకారు. కోడూ నర్తనశాల యందు నాట్యమభ్యసించు ఉత్తరకు ఆరోజు ఆపేరు తలచిన భయము. వలలుని జూచిన భయము. జరుగ బోవు అమంగళము ఆబాలిక హృదయమున, కట్టి భయమును గొల్పినదేమో? మృత్యుదేవత ప్రళయ తాండవ మాడు నర్తన శాల భయమును గల్గించినదేమో? ఈకల్పన మత్యంత రమణీయము.

నర్తన శాలకు వచ్చిన కీచకుడు కొంత సమయమునకు విషయము నందలి యాథార్థ్యమును గ్రహించినాడు. కాని యాతని శరీర మాసందర్భమున సుకుమారముగా నున్నది. కఠిన వలల హస్తము సోకి నంతనే పాషాణ సదృశముగా పరిణమించినది. ఈ మార్పును తెలియజేయుట లోని యౌచిత్యము సహృదయుల కవగతము. ఈ సందర్భమున వీరు వలలుని నోటిద్వారా నేను భీమసేనుడ నని చెప్పించినారు. దీనితో కీచకునకు పౌరుషము హెచ్చినది. 'నాకై స్త్రీ వేషమున వచ్చిన నీ పౌరుష మేటికి?' అనినాడు ఈమాట కీచకుని పాత్రకు గీటురాయి. పౌరుషము గల వాడవు బహిరంగముగా యుద్ధమునకు సన్నద్ధుడవు గావచ్చునుగదా! ఈ దొంగచాటెందులకు? అను భావమును పౌరుషశాలి యగు కీచకుడు పలుకుట ఉత్తమముగా నున్నది.

కాని భీముడు బహిరంగముగా యుద్ధమునకు సన్నద్ధుడగుటకు వీలులేదు కావున అన్నగారి యాజ్ఞానుసారముగా గుప్తముగా కీచకుని వధించినాడు. ఈ నాటకము పాశ్చాత్య నాటకలక్షణానుసారముగా ఒకవిధముగా విషాదాంతము. ఈ చనిపోయిన వాడు సామాన్యుడుకాడు. మహావ్యక్తి. మత్తగజముతో పోరాడగల సామర్థ్యము గజమునకే. అదేవిధముగా తీసిపోనివాడు కీచకుడు. కానియొక విశేషము. బక, హిడింబ, కీచక, భీమ, దుర్యోధను లైదుగురు నొకేతరి యుద్భవించిరి. వీరిలో నెవరిచేతిలో నైన ఒకరు మరణించిన తరువాతి వారందరూ ఆతని చేతిలో మరణింమనట్లు విధాత వ్రాసియున్నాడు. కావున కీచకునకు భీమసేనుని చేతిలో దుర్మరణము తప్పినది కాదు.

(సశేషము)

# కుట్టికవి - మహిష శతకము

- అభినవకాళిదాస శ్రీ తెల్కపల్లి రామచన్ద్రశాస్త్రి

( గతసంచిక తరువాయి )

**మహిష శతకము :**

ఇక నీ కవి మహిషశతకపు తీరును కొంతవరకు విచారింతము. ఈ కుట్టికవి తన జీవిత సమయములో దుష్టరాజుల పరిపాలనను, అందువలన కలిగిన ప్రజా దుఃఖమును సహింపలేక తన మంత్రిపదవిని వదలుకొని వృత్త్యంతరావలంబకుడైనందున తన కుటుంబమును పోషించుటకు శక్తిలేనివాడై వ్యవసాయముతో జీవింప నిశ్చయించుకొని రెండు దున్నపోతులను కొని, కృషిచేయు నారంభించి అందువలన కలిగిన బాధల నెదుర్కొని ధనధాన్యముల నార్జించి సుఖించియుండెనో యేమో! తానీ మహిషశతకమును వ్రాయుటకు హేతువని నిరూపించుచు తనకాలములో నున్న విద్వాంసులైన రాజమంత్రులను స్మృతికి దెచ్చుకొని కృషి నివ్విధముగా ప్రశంసించుచున్నాడు.

'నానాజీ ప్రభుచన్ద్రభాను శహాజీ
ద్రావిన్దరాయాదయో
విద్వాంసః ప్రభవో గతాః శ్రుతి సుధీ
సన్దోహజీవాతవః ।
విద్యాయాం విషబుద్ధయో హి వృషలా
స్సభ్యాస్త్విదానీన్తనాః
కింకుర్వేఽమ్బ! కృషే! ప్రజామిశరణం
త్వామేవ విశ్వావనీమ్॥'

అనగా ధార్మికుడైన నానాజీ మంత్రి చంద్రభాను మహారాజు సుశ్లోకుడైన శహాజీంద్రరాజు ఆయన మంత్రియగు ఆనందరాయలు మున్నగు విద్వత్ప్రభువులు తమ ఆశ్రయమున నుండు విద్వాంసులను చక్కగా పోషించుచుండిరి. ఆ ప్రభువులెల్ల నాయుః పరిమితి దీరి పరమపదించిరి. ఇపుడు కూడా కొందరు ప్రభువులు లేకపోలేదు. ఉన్నారు. అయితే ఇప్పటి ప్రభువులు వృషలులై శ్రుతి స్మృతి పురాణాదుల యందు నమ్మకము లేనివారు. ఇట్టివారివలన విద్వాంసులమైన మాకు రక్షణము కలుగదు. కనుక తల్లీ! ఓ కృషిదేవతా! ధాన్యధనముల నుత్పత్తిచేసి ప్రపంచమును సర్వకాలములయందు రక్షించు నిన్నే నే నాశ్రయించుచున్నాను అని తాత్పర్యము.

ఏమయ్యా! బ్రాహ్మణుడు శాస్త్రసమ్మతముగాని కృషివలన జీవించుట యుక్తము కాదని యందురేమో! అట్లు గాదు. బ్రాహ్మణుడును ఒకపుడు కృషి నాశ్రయించి జీవించుట యుక్తమేయని ఈ కవి క్రింది శ్లోకములో నిరూపించియున్నాడు.

దుర్భిక్షం కృషితో న హీతి జగతి
ఖ్యాతం కిల! బ్రహ్మణా
మాపద్ధర్మతయా మనోశ్చ కృషి గో
రక్షాదికం సమ్మతమ్ ।
భూపేష్వర్థపరేషు హన్త సమయే
క్షుణ్ణే చ దుర్భిక్షతో
వృత్త్యర్థం కృషి మాశ్రయే మ భువి నః
కం వా తతో హీయతే॥

అంటే 'కృషితో నాస్తి పాతకమ్' అను అనుభవజ్ఞుల సూక్తినిబట్టి నేను గూడా కృషినాశ్రయించిన కలవులేదని నిశ్చయించుకున్నాను. బ్రాహ్మణుడు కూడా జీవనము జరుగనపుడు కృషిగోరక్షణాదులను అవలంబించ వచ్చునని మనుధర్మశాస్త్రము ఒప్పుకొన్నది. రాజులిపుడు సత్ప్రవర్తనలేక ధనాశాతత్పరులై యున్నారు. ఈ సమయము కఱవుచే పీడింపబడుచున్నది. విద్వాంసులను పోషించువారుకేరు. ఇట్టి సమయములో కృషితో జీవించుటలో తప్పేమియు లేదు. ఆపద్ధర్మముగా కృషినాశ్రయించినను స్వధర్మమును చక్కగా ననుష్ఠించెదను. దీన నాకే లోపము కలుగదు' అని భావము.

ఏమయ్యా! ప్రభువులు విద్వాంసులను పోషించు స్థితిలో లేనపుడు ఉపాధ్యాయ వృత్తితోనైనా జీవించుట శాస్త్రసమ్మతము కదా! దానితో జీవించక కృషి నేల ఆశ్రయించెదవు అని యందువేమో అట్లుగాదని దున్నపోతు నుద్దేశించి ఈ క్రింది శ్లోకములో నీవిధముగా చెప్పుచున్నాడు.

'ఆర్య శ్రీధర మంబుదీక్షిత మిమౌ
దృష్ట్వా మహాపండితౌ
విద్యాయై స్పృహయే న యద్యపి వరం
క్షాత్రం బిభేమ్యాహవాత్ ।
వాణిజ్యం ధనమూలకం తదఖిలం
త్యక్త్వాశ్రితస్త్వాం మహాం
త్వం విద్యా చ ధనం త్వమేవ సకలం
త్వం మే లులాయప్రభో!'

ఓ మహిషరాజా! పూజ్యుడైన శ్రీధరుడు మహాపండితుడు. ఈయన ఉపాధ్యాయ వృత్తి నవలంబించియున్నాడు. అంబుదీక్షితుడు షడ్దర్శనముల చదువుకొని అగ్నిహోత్రాగ్నిష్టోమాది నిత్యనైమిత్తిక కర్మాచరణ తత్పరుడయ్యె. వీరిద్దరు అధ్యాపన, యజన నిరతులైయుండియు ఎల్లప్పుడు దారిద్ర్యముచే పీడింపబడుచున్నారు. కనుక వీరిం జూచి విద్యాజీవనముపై స్పృహలేనివాడనైతిని. క్షాత్రధర్మము నవలంబించి జీవింతమంటే యుద్ధము చేయుటకు భయపడుచున్నాను. వ్యాపారము చేసి జీవింతమంటే అందుల కవసరమైన మూలధనము నా దగ్గర లేదు. కనుక వీని నన్నింటిని వదలి నిన్నాశ్రయించితిని. నాకు నీవే విద్యవు. నీవే ధనమువు. సర్వము నీవే. నీయాశ్రయముచే సర్వసౌఖ్యములు కలుగ గలవు. అని పై శ్లోకమునకు తాత్పర్యము.

ఇది గాక-

'విద్యాపణ్య విశేష విక్రయవణి
గ్జాతస్సుధీ శ్రీధర
స్వన్నం స్వర్ణ మభూ ద్బతాంబు మఖినో
ధ క్తస్య షడ్దర్శనీమ్।
ఖ్యాతః కుట్టికవిస్తు దుర్గ్రహ
ద్వారేషు నిద్రాయతే.

తత్సర్వం మహిషేశ్వ రాననుస్మృతే
ర్దౌర్భాగ్య ధామ్నః ఫలమ్'

అని చెప్పియున్నాడు. అనగా నా సమకాలికుడైన శ్రీధర పండితుడు జీవనము జరుగక ఉపాధ్యాయ వృత్తినవలంబించి డబ్బెక్కువ యిచ్చినవారికి ఎక్కువగను, తక్కువ యిచ్చినవారికి తక్కువగను చదువు చెప్పుచు వేదాది విద్యలను వ్యాపారసరళిగా మార్చి కేవలము వైశ్యుడైనాడు. నా సహాధ్యాయియైన సాంబు దీక్షితుడు షడ్దర్శనములు చదివినాడు. కాని ఆయనకు స్వన్నము అనగా పరివంటకము బంగారమైనది. (అంటె బంగారు వలె మంచి అన్నము దొరకుట కష్టమైన దనుట) ఇట్లున్నపుడు ఆయన షడ్దర్శనములకు ఏమి ప్రయోజనము కలిగినది? ఇదిట్లుండగా జగత్ప్రసిద్ధుడైన భట్టి కవియైతే దుర్ధనికుల తల వాకిండ్ల ముందర బడి నిద్రపోవుచున్నాడు. ఈ ముగ్గురు పండితు కట్టి దురవస్థపట్టుటకు మహిప రాజు నాశ్రయించక పోవుటయే కారణమయ్యె నని యన్నాడు భట్టికవి యని తాత్పర్యము.

ఇంతేగాక పాపమా మహాకవి సుఖ జీవనము లేక 'శ్రుతిస్మృతి ప్రత్యక్షార్థాపత్తులచే కృషియే చేయదగినది. అదియే జీవనమునకు ముఖ్యసాధనము' అని నిర్ణయించుకొని, ఆ కృషికి ముఖ్యహేతువైన దున్నపోతునకు రాచరికము నంటగట్టి కార్యాకార్య వివేకములేక అన్యాయముగా ధనార్జనము చేసి సర్వోత్కృష్టుల మని విఱ్ఱవీగెడు రాజుల దుశ్చరిత్రను వెల్లడించుటయే ఈ మహిషశతకమునకు ప్రయోజన మని తలంచి ఇవ్విధముగా చెప్పుచున్నాడు.

'యం యో రక్షతి తస్య స ప్రభు రితి
స్పష్టం హి మద్రక్షిణో
రాజశ్రీ మహిషా స్వనుత్య సఫలం
కుర్వేద్య వాగ్వైభవమ్।
మత్పీడానిరతా న్మదీయ మహిమా
భిజ్ఞానశూన్యా న్ప్రభూన్
యన్నిన్దామి నిశమ్య తద్గుణవిద
స్తుష్యన్తు సన్తో నృపాః' ॥

అనగా ఎవడు ఎవనినిరక్షించుచున్నాడో వాడు అతనికి ప్రభు వని ప్రసిద్ధమైనది. అందువలన రాజ్యలక్ష్మితో గూడి సకల ధాన్య సంపాదనచే, నన్ను రక్షించుచున్న మహిష ప్రభువులకు స్తుతించి నా వాగ్వైభవమును అనగా సాహిత్యప్రాగల్భ్యమును సఫలము చేసికొనుచున్నాను. నాపాండిత్య మహిమ నెఱుంగక నన్నెవరు పీడించుచున్నారో! ఆరాజులను నిందించుచున్నాను. ఈనిందనము విని గుణగ్రాహులై యోగ్యులైన రాజు లందరు సంతసింతురుగాక!' యని భావము.

ఈ మహాకవి ధనవంతుల నాశ్రయించగా వారు ఈకవి విద్యాప్రభావమును లెక్కించక ఎంతటి అనాదరమును చూపిరో కాని ఈయన వారి యనాదరమును సహించలేక ఈ పద్యము వ్రాసినాడు

'మత్తా విత్తమదై ర్దురాగ్రహ భృత
శ్చణ్డాల రణ్డా సుతాః।
యేమీ దుర్ధనికా నితాన్త పరుష
వ్యాపార కాలేయకాః
తేషాం వక్త్ర విలోకనా త్తవ పరం
స్థూలాణ్డకోశేక్షణం
యేన శ్రీ మహిషేన్ద్ర! లభ్యత ఇహ
ప్రాయేణ మృష్టాశనమ్॥

అనగా ధనమదముచే గర్వితులై మేమే సర్వోత్కృష్టుల మను అభిమానముచే విఱ్ఱవీగుచు నన్యాయార్జితమైన ధనముగలవారై కుక్కలవలె కటువుగా మాట్లాడు సంకరజాతి ముండా కొడుకుల ముఖములను జూచుటకంటె ఓ మహిషరాజా! నీయండ కోశదర్శనము మేలు గలిగించును. ఎందు కనగా నీ యండకోశ దర్శనము చేయుచు అటుక దున్నగా దానివలన వరి వంటకము పప్పు మున్నగు ఉత్తమ భోజనము సుఖముగా లభించుచున్నది. దుర్ధనికుల ముఖము జూచిన నేమియు లాభము గలుగదు!' అని అర్థము.

ఇదిగాక ఈకవి విద్యాజీవనము జరుగనందున దున్నపోతులను సాధనముగా జేసికొని జీవించుచున్నప్పటికిని, అప్పటి దుష్టపరిపాలనములోని అధికారులు పొలములో పండించిన ధాన్యమును బలాత్కారముగా గొంపోవుచుండిరట. ఈవిధానమును సహించలేక_

దేహం స్వం పరిదగ్ధ్య యద్ధి భవతా
ధాన్యం ధనం వార్జితం
తత్సర్వం ప్రసభం హరన్తి హి సుబే
దారా స్స్వకీయం యథా।
హేతు స్తత్ర కిలాయ మేవ మహిష!
జ్ఞాతో మయా శ్రూయతాం
పుత్రా ఏవ పితు ర్హరన్తి హి ధనం
ప్రేమ్ణా బలా ద్వాఖిలమ్'

అని చెప్పినాడు. అనగా ఓ దున్నపోతా! నీవు నీ శరీరమును కష్టపెట్టి ఏ ధన ధాన్యములు సంపాదించినావో! వానిని సుబేదారుడు మొదలగు ప్రభుత్వోద్యోగులు తమ సొత్తువలె తీసికొని పోవుచున్నారు. ఇట్లు తీసికొని పోవుట కేమి కారణమో దాని నే నెఱింగితిని. దానిని నీకు చెప్పెద వినుము. లోకములో ప్రేమతో గాని బలాత్కారముగా గాని తండ్రి ఆస్తిని తీసుకొనువారు కొడుకులే కదా! అంటే వీరునీకు పుట్టినవారు కనుక నే నీకష్టార్జితమును తీసికొనుచున్నారు. అని భావము.

మరియు దున్నపోతుపండించిన ధాన్యమును గొంపోవుచున్న సుబేదారాది దుష్టాధికారులను శబ్దశక్తి మూలమున సాధర్మ్యము ధ్వనించునటులు తనకవితా సామర్థ్యమును వెల్లడించుచు

'ఉన్మత్తా ద్రవిణాధికార వశత
స్సంభం గతా దర్గజై

స్సంజాతా వృషలేశతో విరచితా
న్యాయావిభూత్యా వృతాః।
కేచిచ్ఛృఙ్గభృతశ్చ సంప్రతిసుబే
దారాధమాః కాసర!
జ్యేష్ఠాఃకిం భవతో వద త్వ మథవా
సత్యం కనిష్ఠా ఇమే॥'

అని చీవాట్లు పెట్టుచున్నాడు.

ఓదున్నపోతా! పరమనీచులైన సుబేదారాదులు ద్రవిణాధికార వశతః ఉన్మత్తాః। ద్రవిణ = ధనము. అధికార = చెల్లుబడి, వశతః = తమస్వాధీనమై యున్నందున, ఉన్మత్తాః = మదించి యున్నారు. నీవును ద్రవిణాధికారవశతః. ఉన్మత్తః అంటే ద్రవిణ = బలిమిచే, అధిక = మిక్కుటమైన. ఆరవ = ధ్వనులయొక్క, శత = నూర్లుగలదానవై ఉన్మత్తః = వెఱ్ఱెత్తినదానవు; అనగా ఎదరైన గేదెను చూచి అనేక విధముల నఱచుచు ఒడలెఱుగక యుందువనుట. వారు, దుర్గుణైః = దంభాహంకారము మొదలైన చెడుగుణములచేత: స్తంభంగతాః = స్తబ్ధులైయున్నారు. అంటే ఈ పని చేయవచ్చు, ఈపని చేయకూడదను జ్ఞానము లేని వారనుట. నీవు దుర్గుణైః = కఱ్ఱత్రాళ్ళచేత, స్తంభంగతః = కట్టుగుంజను పొందియున్నావు, వారు వృషలేశతః = వృషల = శూద్రులలో, ఈశతః = శ్రేష్ఠునివలన, సంజాతాః = పుట్టినారు; నీవు వృషలేశతః= వృష = పుణ్యముయొక్క, లేశతః = లేశమువలన, సంజాతః = పుట్టినావు, ఏకొద్ది పుణ్యముననో జన్మించితి వనుట. విరచితాఽన్యాయావిభూత్యా. విరచిత = చేయబడిన, అన్యాయ = అన్యాయము గలవారై అవిభూత్యా = విరుద్ధమైన ఐశ్వర్యముతో, ఆవృతాః = కూడుకొన్నవారు_అంటే అన్యాయము చేసిలంచములు దీసికొని, సంపాదించిన ధనము గల వారనుట. నీవు విరచిత + అన్య + ఆయ + అవిభూత్యా + ఆవృతః - అనగా విరచిత = చేయబడిన, అన్య = నిను పాలించువారియొక్క, ఆయ = ధనము గలదానవు; అవిభూత్యా = మిక్కిలి సరిపోవునంతధనమును సంపాదించి పెట్టిన కారణముచే ఆవృతః = అంగీకరింపబడినావు, వారు శృంగభృతః, శృంగ = కొమ్ము వాద్యమును భృతః = ధరించిన వారు. అంటే సుబేదారాద్యధికారులు గ్రామములకు వచ్చినపుడు వారి ముందు కొమ్ము వాయించుకొనుచు వచ్చు ఆచారముగల దనుట అట్లే నీవు శృంగ = కొమ్ములను భృతః = ధరించియున్నావు నీవును సుబేదారాదులవును ద్రవిణాధికార వశోన్మత్తత్వాదులగు ధర్మములు సమానముగ కనబడుచున్నవి. కనుక నీచులైన సుబేదారాద్యధికారులు, భవతః=నీకు జ్యేష్ఠాఃకిం = అన్నలా! అథవా=లేక, కనిష్ఠాః = తమ్ములా, వద = చెప్పుమని అర్థము. అనగా దున్నపోతుకంటె అధము లని భావము.

మఱియు నీకవి అప్పటి దుష్పరిపాలనలో కుటిలులు, మూఢులునైన సభ్యులతో నిండియుండిన రాజసభను స్మృతికి దెచ్చుకొని ఆ దున్నపోతును ఈ క్రింది విధముగా ప్రేరేపించుచున్నాడు.

కర్షం కర్ష మహర్నిశం వసుమతీం
క్లిశ్నాతి కిం కాసర!
త్వం సభ్యై రధునాతనై ర్నృపసభాం
సాకం సుఖే నావస।
న జ్ఞానం న చ మేఽస్తి కౌశలమితి
వ్యర్థాం మతిం మా కృథా
స్త్వత్తో మూఢతమా ఇమే, భవసి హి
త్వం తేషు వాచస్పతిః

అంటే ఓ దున్నపోతా! నీవు రాత్రింబవళ్ళు పొలముదున్ని ఏల శ్రమచెందుచున్నావు? ఇపుడు రాజసభలో నుండు సభ్యులతోగూడ రాజసభకు వెళ్ళి సుఖముగా నచట గూర్చుండుము. నాకంతటి బుద్ధి, మరియు నేర్పు లేదని యందువేమో! అట్టిపనికి మాలిన ఆలోచనను వదలుకొనుము. ఇపుడా సభలో నుండు సభ్యులందరు నీకంటె మూఢులు నీవక్కడికి పోయినచో నీవు వారందరిలో బృహస్పతి వయ్యెద వని తాత్పర్యము.

ఇంతవరకీ మహాకవి తానీశతకములో శతకరచన హేతువును, కృషినాశ్రయించుట వలన గల లాభమును, అప్పటి దుష్పరిపాలనలోని యుద్యోగులను వారి దుశ్చేష్టితములను దాదాపు నలుబది పద్యములతో వివరించినాడు తక్కిన అఱువది పద్యములతో చక్కని శ్లేష, మనోహరమగు వ్యంగ్య మర్యాద, సాళములైన ఉపమాద్యలంకారములును సులభముగా పండిత హృదయగోచరమగునటులు దున్నపోతును- శ్రీ వైష్ణవుడు, రామాయణము, ఆంజనేయుడు, మన్మథుడు, సముద్రము మొదలగు నుపమాన వస్తువులతో పోల్చి వర్ణించినాడు. ఈ యఱువది పద్యములలో గొన్నిటిని మాత్రము పఠితలకు బరిచితములను గావించుచున్నాను.

'ధత్సే శృంగయుగం ప్రతప్త మభితో
గాత్రేచ చక్రాంకణం
శ్రీరామానుజ మండలస్య సదృశం
చిహ్నం చ ధత్సే ముఖే।
పంక్తిర్భూయ నిజ ప్రబంధ సమయే
క్రందస్య మంకారవం
నూనం శ్రీ మహిషాధిరాజ! భవసి
శ్రీవైష్ణవాగ్రేసరః'

అని చెప్పినాడు. అంటే మహిషాధిరాజ= ఓదున్నపోతా! నీవు శ్రీవైష్ణవాగ్రేసరః = వైష్ణవశ్రేష్ఠుడవు, భవసి = అగుచున్నావు; ఎట్లనగా వైష్ణవుడు శృంగయుగం. శృంగ = గుర్తులయొక్క యుగం = జంటను ధరించుచున్నాడు. అనగా తెల్లని సుద్దతో రెండు నిలువు

నామములు దిద్దుకొందు వనుట. నీవును, శృంగయుగం = రెండు కొమ్ములను ధరించుచున్నావు. ఆయన-గాత్రే = శరీరమందు అభితః = అంతట అనగా ఇరు ప్రక్కలనుండు భుజములందు, చక్రాంకనం = గుర్తును, అంటే కాల్చబడిన చక్రముల గుర్తును ధరించుచున్నాడు. ఆయన రామానుజమండలస్య = రామానుజ = రామానుజమతస్థుల యొక్క, మండలస్య = గుంపునకు, సదృశం = యోగ్యమైన, చిహ్నం = గుర్తును, ధరించుచున్నాడు. అనగా లలాట భుజోదరాదులందు సుద్దతో నామములు ధరించుచున్నాడనుట నీవును రామా = లక్ష్మీదేవికి, అనుజ = తమ్ముడైన చంద్రునితో, సదృశ = సమానమైన, చిహ్నం = గుర్తును ముఖమున ధరించుచున్నావు. అంటే ముఖమున చంద్రునివలె గుండ్రనైన తెల్లని చుక్కను ధరించుచున్నావనుట (ఆయన) నిజప్రబంధ సమయే, నిజ = తనదైన, ప్రబంధ = ద్రావిడ ప్రబంధము యొక్క, సమయే = సమయమందు అనగా దేవోత్సవాది సమయములో, పంక్తిభూయ = వైష్ణవ పంక్తులలో చేరి, అమందారవం = ఎక్కువ ధ్వనిగలుగునట్టుల, నిజ = నీయొక్క, ప్రబంధ = గట్టిగా కట్టివేయుట యొక్క, సమయే = అవసరములో, పంక్తిభూయ = దున్నపోతులవరుసలో చేరి అమందారవం = పెద్దధ్వని గలుగునట్టుల, క్రందసి = అరచుచుందువు. కనుక తప్పక నీవు శ్రీవైష్ణవుడవే అగుచున్నావని అర్థము.

ఇట్లే ఈ క్రింది పద్యములో దున్నపోతును మన్మథునిగా వర్ణించియున్నాడు.

'నిత్యం ధీరమనాంసి కర్షసి సదా
రత్యాం సముత్సాహవాన్
ముగ్ధానా ముపమాసి మాసి తపసి
జ్యాకర్షణేనోజ్ఝితః।
సామర్థ్యం విషమేషు కర్మసు భజ
న్నగ్రేవసన్తం స్పృశ
న్నిత్యం శ్రీమహిషేన్ద్ర! మన్మథ ఇవ
ప్రత్యక్ష మాలక్ష్యసే॥

అనగా ఓ మహిషరాజా! నీవు మన్మథుని వలె కనపడుచున్నావు. ఎందుకనగా మన్మథుడు, నిత్యం = ఎల్లప్పుడు, ధీరమనాంసి, ధీర = యోగులయొక్క, మనాంసి = మనస్సులను, కర్షతి = క్షోభింపజేయుచున్నాడు. నీవును, నిత్యం = ఎల్లప్పుడు, ధీరం + అనాంసి, కర్షసి, ధీరం = గట్టిగా, అనాంసి = బండ్లను, కర్షసి = లాగుచున్నావు; ఆయన సదా రత్యాం సముత్సాహవాన్ = ఉత్సాహవంతుడైయుండును నీవును, సదా = ఎప్పుడును, రత్యాం = రతిక్రీడయందు, సముత్సాహవాన్ = సంతోషముగలవాడవైయుందువు, ఆయన ముగ్ధానాం = సుందరులకు ఉపమా = పోలిక చెప్పకొనదగినవాడగుచున్నాడు. నీవును ముగ్ధానాం = మూఢులకు, ఉపమా = ఉదాహరణభూతుడవు, అసి = అగుచున్నావు. మన్మథుడు, తపసిమాసి = మాఘమాసమున జ్యాకర్షణే, జ్యా = అల్లెత్రాడుయొక్క, ఆకర్షణేన = లాగుటచేత, ఉజ్ఝితః = వదలిపెట్టిబడినవాడు, నీవును తపసిమాసి = మాఘమాసమునందు, జ్యా = భూమియొక్క, కర్షణేన = దున్నుటచేత, ఉజ్ఝితః = వదలిపెట్టబడెదవు. మాఘములో జనులు తపములో నిమగ్నులైయుందురుగనుక అపుడు మన్మథునకు జ్యాకర్షణతో అవసర ముండదు. మాఘమాసములో దున్నపోతుకు భూమిదున్నపనియుండ దని భావము. మన్మథుడు విషమేషు కర్మసు, విషమ = పంచ సంఖ్యాకములైన ఇషు = బాణములయొక్క, కర్మసు = పనులయందు, అనగా తన పంచబాణములను వింటికొందు ఎక్కుబెట్టుట, వదలుట మున్నగు పనులయందు, సామర్థ్యం = దిట్టయగుటను, పొందగా, నీవును విషమేషు = కష్టములైన, కర్మసు = బండిలాగుట మున్నగు పనుల యందు, సామర్థ్యం = దిట్టయగుటను, భజన్ = పొందుచుందువు మన్మథుడు, వసంతం = తన మిత్రుడైన వసంతుని, అగ్రే = ఎదుట, స్పృశన్ = స్పృశించుచుండ, నీవును, అగ్రే = ఎదుట, వసన్తం = ఉన్నవానిని, స్పృశన్ = రాచికొనుచు పోవుదువు. కనుక నీవు మన్మథ ఇవ = కామునివలె, ప్రత్యక్షం = సాక్షాత్తుగా. ఆలక్ష్యసే = కనబడుచున్నా వని దీని యర్థము.

ఇట్లే ఈపట్టి మహాకవి దున్నపోతును వర్ణించు మిషతో రాజును సత్ప్రవర్తనగల వానినిగా జేయదలచి దున్నపోతును సర్వ దేవతాత్మయని, సర్వోత్కృష్టస్తువని, రాజుకంటె గొప్ప దని, స్తుతించినాడు. శతకమును సమాప్తిచేసి చివరకు తనను మనుపు పోషించిన భోసల వంశ ప్రభువునకు ఆయురారోగ్యములు గలుగ నాశీర్వదించి యున్నాడు. ఈ గ్రంథము విశేష సనాథమై యున్నందున దీనిని మహా ప్రబంధ మనుటలో నతిశయోక్తి లేదు. ఇందలి హృదయంగమమైన వ్యంగ్య మర్యాద, సుబోధములైన శ్లేషకవిత్వరీతులు, ఉపమాద్యలంకారములు, అక్లిష్టనిరర్గళ పతిత పదజాలములును ఈమహాకవి వాక్యానుదాస్య మొనరించినవి. ఈ గ్రంథముతో పరిచయము గలిగిన సహృదయులకీ యంశములెల్ల హృదయ గోచరములు గాగలవు.

—:జయన్తు రసికాః సర్వే :—

'ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం సౌజన్యంతో'

# కావ్యాలంకార సంగ్రహము - సమాజ దర్పణము

- శ్రీమతి పి. కుసుమ, ఎం. ఏ.

భాషాపరిజ్ఞానమునకు ఛందో వ్యాకరణములట్లు వాఙ్మయతత్త్వ - పరిశీలనమునకలంకార శాస్త్ర మత్యంతోపాదేయము' అని శ్రీ బులుసు వేంకటరమణయ్యగారనిరి. మనము చేరదలచుకొన్న గమ్యానికి మైలురాళ్ళు, బోర్డుల ఇన్‌స్ట్రిక్షన్లు, ఎలా ఉపకరిస్తాయో, అలాగే వివిధ మార్గాల పయనించు అనేక సాహిత్యశాఖా విహంగాలకు అలంకార శాస్త్రం అత్యంతాత్యంతోపాదేయమే కదా!

ఎంతో తేలిక అనిపించే అలంకార శాస్త్ర రచన వాస్తవానికి పురాణ ప్రబంధరచనలకన్నా అత్యంతక్లిష్టమూ క్లిష్టతరమూను! పురాణ ప్రబంధాలలో స్వకపోల కల్పనలకు, విస్తృతాష్టాదశ వర్ణనలకు ఎంతో అవకాశమున్నది. అలంకారశాస్త్రంలో అలాంటి అవకాశం లేదు. అది నిర్దిష్టనియమావళిని అనుసరించాలి. స్పష్ట సూత్రానుసంధానమయి ఉండాలి; ఖచిత సిద్ధాంతవ్యక్తీకరణ కాంచన కుంభంలో బంధింపబడిన సాహిత్య పయోనిధి. అలాటి అలంకార శాస్త్ర గ్రంథరచనకు పూనుకొన్నాడంటే ఆ కవి తన మస్తిష్కంపై ఎంతటి భారాన్ని వహించ బూనుకొన్నాడో అర్థమౌతుంది.

సాహిత్యం నాటి సమాజాన్ని నాటి జనుల వ్యవహారాచారాలను అలవాట్లను ప్రతిబింబిస్తుంది. సమాజానికి దర్పణం సాహిత్యం. విభిన్న సాహిత్య ప్రక్రియలలో మౌలిక భేదాలుండవచ్చును గాని సమాజప్రతిబింబత్వంలో మాత్రం ఏకత్వాన్ని సహిస్తున్నాయి. పురాణ ప్రబంధ ఖండకావ్యాది రచనలు కథాసూత్రంతో అల్లబడిన వివిధ వర్ణనా శోభిత పుష్పమాలికల వంటివి. అలంకారశాస్త్రం సమస్త వర్ణాలను కాంతి కిరణాలను ప్రతిఫలించే అమూల్య రత్నం వంటిది. చిన్న ఆధారంతో విస్తరించే వర్ణనా పత్ర పుష్పఫల శోభిత సాహితీ ప్రక్రియలు ప్రబంధాది వాఙ్మయలతానికుంజాలు. అయితే స్వేచ్ఛాగగనవిహార పతంగాలను తుపానులో గాలివాటుగా కొట్టుకుపోయి ముళ్ళడొంకలలో పడిపోకుండా సూత్రంతో నిలిపి, వారించి, జాగ్రత్తగా ఎగిరేటట్లు ప్రయత్నం చేస్తాయి అలంకారశాస్త్రాలు.

'కావ్యాలంకార సంగ్రహము' అలాటి ఒక అలంకార గ్రంథము. ఇది మూర్తికవి ప్రణీతము! 'నరసభూపాలీయము' దీని నామాంతరము; విద్యానాథకృత సంస్కృత 'ప్రతాపరుద్రీయము' ఆధారము; మూర్తికవియే రామరాజ భూషణుడని ప్రతీతము; తత్ చర్చ ప్రస్తుతము అనవసరము. కావ్యాలంకార సంగ్రహము సమస్తాలంకారశోభిత మనునది వాస్తవము.

సాధారణంగా మన ప్రబంధాలలోని వర్ణనలు చాలావరకు చర్విత చర్వణంగా ఒకే మూసలో పోసినట్లుగా ఉన్నాయి. మూర్తికవి లక్షణగ్రంథంలో అలంకారోదాహరణముల నివ్వడంలో క్రొత్తపుంతను త్రొక్కాడు. ఆనాటి శైలిలో కొన్ని విలక్షణ నూతన మార్గాలను అనుసరించి కొంత విభిన్నతను సాధించాడు. ఆ విలక్షణతలోనే మనకు నాటి సమాజ స్వరూపాన్ని, అమూల్య చారిత్రికాంశాలను అందించాడు.

'కావ్యాలంకార సంగ్రహ' కృతికర్త తత్కృతిభర్త యగు ఓబయ నరసింహరాజు (ఓబళ నరసరాజు) ను ప్రథమాశ్వాసంలో ప్రస్తుతించి, గ్రంథమునంతను నరసోర్వీనాథుని పరంగానే రచించాడు. ఆ రాజకవి ప్రస్తుతివలన మనకు నరసరాజు వంశవర్ణనాదికాలు తెలుస్తున్నవి. ప్రథమాశ్వాసమున 30 నుండి 36 పద్యాలవరకు సూర్యవంశపు పూర్వపురుషుల క్రమము తెలుపబడినది. కలియుగమున ఆవంశ పురుషుడై ఒప్పు కరికాల చోళవిభుడు. 'ఆ కరికాలచోళ కుంభినీనాయకులమున సంభవించె...పోచిరాజు' వారిలో 5 వ తరమున ప్రభవించిన రాజు 'ఓబళ నరసరాజు.' 91 వ పద్యంలో ఓబనృపాల లక్కమాంబలకు 'నృసింహ ధరణిపతి జనియించెన్.' మన చరిత్రకారులు బుర్రలు బద్దలుకొట్టుకోకుండా ఇంతటి సుదీర్ఘాంశాలను మన కందజేసిన మూర్తికవికి మన మెంతో కృతజ్ఞులమై ఉండాలి. ఇలాగే ఆర్యులకంటె నరసరాజు భిన్నజాతి అనే విషయం ఈ గ్రంథం ద్వారా ధ్రువపడుతుంది (1 ఆ) 'చంద్రగుప్తి దుర్గము' న 'వేంకట క్షితివరుడు' నిలసిల్లెను 'తొరగంటి నరసభూప!' (5 ఆ. 172 ప) వలన తొరగంటి దుర్గానికి 'పోచిరాజాన్వయాంబోధి పూర్ణచంద్రుడు' ప్రభువై ఆలగారె నని తెలియుచున్నది. 'ఇంద్రుడో? యీయుపేంద్రుడో? ... యంచు' 'సాంద్రభుజప్రతాపరణసాహసు నోబయనారసింహు' ని 'ఆర్యులు' తలంతు రట! గుణాది విరోధ, ద్రవ్యవిరోధమున కిచ్చిన ఉదాహరణములో 'తలిరుబోడి...చర్చింపగా నార్య (= పార్వతి) యై, చెలువం బందియు నవ్యభాష (= సరస్వతి) యగు'

ఈ లక్షణ గ్రంథ రచనాకాలము నాటికే కొన్ని తదాధునిక పరిస్థితులు, పద్ధతులు, పదాలు ప్రవేశించినవి. రాజు యొక్క 'యశోజలజాక్షి ... వైమానిక వాహిని న్నగు నమంద ని జాతిశయంబు పేర్మికిన్' స్వాధీనపతికకు తార్కాణమైనది. నాటికే విమానాలు, యంత్రాల

మన దేశంలో వాడుకలోనికి వచ్చినవి (రోషము) 'నిలునిలుమనంగ! నరసింహు డింతితో గూడినజా; లలరు భవదీయచాపము। కలుగానుగ ద్రిప్పి పిప్పిగా గావింతున్,' అప్పటికే రాతిగానుగలు వాడేంతటి నాగరకత భారతదేశంలో ఉన్నదన్న మాట!

తోరగంటి దుర్గరాజ్య, స్థిరసింహాసన నివాస దీక్షానిధికిన్, వరయంత్ర మత్స్య భేదన, బిరుదోద్దండునకు గండభేరుండునకున్. (1 ఆ 107 ప)

'.నరసేంద్రుం డొకమ్మున, మత్స్యయంత్రమున్ సాంద్రనిమాధి నేసె నని సంతతము న్వినితత్తరించి మ; త్స్యేంద్రుడు (ఈత డొక రాజేమో!) యోగముద్ర ధరియించి చరింప దొడంగెను.' 'వెలదికి మణితాటంకము, లలరున్ దిగ్విజయకాంతకు నతనుడు చూపుం, జిలుకలు నిశాతములుగా, నలవడ నడిదేడు శాణయంత్రము (సానబట్టే యంత్రము) లనగన్' (3ఆ 31 ప) వలపులసూత్రధారుడగు మన్మథుడే 'అనవద్యనృపాకృతి' జూచి నిశ్చలత వహింపగా' కలికి .కదలజాలని జంత్రపు బొమ్మవలె నిశ్చలగాత్ర వల్లియైనది 'సలిలచ్ఛాయ గుణించి యంత్రకృత మత్స్యంబీ నృసింహాత్మజా; తల సాధ్యాగ్రణి యేసె నంచు విని తద్వంశాధిపుంబట్టినన్, సలిలచ్ఛాయ గుణించి యేయు నని యంచద్భుతి మార్తాండునిన్, బలిమింబట్టెడకోగ రాహు విధునిం బైకొన్న చందంబునన్' నరసభూవరు వంశమూల పురుషుడగు సూర్యుని (యంత్రమత్స్యము నేసిన నరసనృపు ప్రతాపాగ్నికి బెదరి) రాహువు చంద్రుని పట్టినన్ని సార్లు సూర్యుని గ్రసించడు ఇది మన పూర్వుల భూగోళ శాస్త్రమథనమునకు తార్కాణము. నరస భూపాలుడు భూభారమును వహించుటచే అనుపమచ్ఛాయా విహారం మందగల్గె, చిమ్మచీకటి ముంగు నెమ్మె కాని! సూర్యుని భార్య ఛాయాదేవి అనెడి పురాణ కల్పన మన ప్రాచీనుల ప్రజ్ఞా పాటవాలకు నిదర్శనం

భారతీయులు సంగీతశిల్ప కళాదులను విశేషకృషితో అనన్య సామాన్య ప్రజ్ఞా పారీణతతో అనితర సాధ్యాలుగా రూపొందించారు. 'ప్రతిదిన కనక వసంతా, ర్జితకృతికాంతుడు భూపతి. వసంత, కనకాగులచే ఆర్జించిన కృతులు కల నాయకునకు 'వసంత రాగాలతో కూడిన కృతులయెడ ఇష్టము కలదు ఆకాలమున 'విజయభేరి' తప్పెటలు, (1ఆ, 12) పటహాలు కాహళులు (34 38 ప) కోలలు (3ఆ-16) వీణలు ఢక్కా (ఆ-103ప) మొదలైన అనేక వాద్యాలు సప్తస్వరరంజకములై విలసిల్లినవి

నరసనృపాలు రాజ్యము భోగభాగ్యాలతో విలసిల్లినది. నరసవిభుయశస్సామ్యమునకై పరమేశ్వరుడు 'మడికాను (= వెండి గుంటిపై గూర్చుండి, సంజ కెంజాయపెన్జడలు దాల్చి యచ్చుగా, బులి-తోలుకచ్చడంబు ఘటించి.' తపస్సు చేయుచున్నాడని కవి చమత్కారకల్పనము నవరసములు తొమ్మిది రంగులతో నరసేంద్రు భవనమున నవరత్న రూపమున తనరారుచున్నవి

మరకతానీక దంభమున శృంగారంబు
హాస్యంబు ముక్తాఫలౌఘరుచుల
కరుణ విద్రుమ వర్ణ గౌరవచ్ఛలమున
రౌద్రంబు పరువింద రత్నకలన
వీరంబు గోమేధికారోపిత స్ఫూర్తి
భయమువై దూర్య శోభామిషమున
భీభత్స మింద్రనీలాభాగణంబున
శాంతి నిర్మల హీర కాంతి గతుల
నద్భుతము పుష్యరాగ రాగాపదేశ
విలసితంబున సాకార వృత్తి గాంచి
నవరసంబులు వొల్చు నీ భవనవీథి
భుజబల సుబల నృసింహా! యోబయ
నృసింహా!

ఈ పద్యము తద్వైభవ కాంతినే గాదు, భారతీయాలంకారికుల నిసర్గ రమణీయ తులనాత్మకతకు కల్ప లకు తలమానికమైన నిదర్శనము. శృంగారము నల్లకలువరంగు కలది, హాస్యము ముత్యమువలె తెల్లనిది-కరుణము పవడము, గాఢమైన ఎర్రరంగు రౌద్రము-లేత ఎరుపు, వీరము గౌరవర్ణము, భయము ధూమ్ర వర్ణము, భీభత్సము నీలము, శాంతము హీరము అనగా స్ఫటికవర్ణము, అద్భుతము పుష్యరాగము అనగా పసుపు పచ్చనిరంగు ఇవి సంకేతములుగా కలిగి ఉన్నవి. (ఇలాగే దీనికి ముందరిపద్యంలో ఆయా రసములకు అధిదేవతలను క వర్ణించాడు) 'కపురాలవన్నె చొక్కపురాలు' కర్పూరవర్ణపు చల్లని చంద్రకాంత శిలలు కుందాది నిధులు - పద్మ, శంఖ, మకర కచ్ఛప, ముకుంద, కుంద నీల. వర్ణములనే నవనిధులు, మహానీల నికరములు-ఇంద్రనీల మణుల గుంపులు రత్న కనకాదులతో ఆ రాజ్యము విలసిల్లినది. రాజు 'హేమ' నాగాశ్వదుడు బంగారమును ఏనుగులను, గుఱ్ఱాలను 'రామావసంతీ వసుత్రుము' కన్యలను గోధుమలను, భూమిని, సదా దానము చేయుచు ప్రజలను కన్న తండ్రివలె ప పాలించాడు. అతడు 'మదనాగ తురంగ పూర్ణ మణిమయ సదనుడు. మదగజ అశ్వాలతో నిండిన మణిమయ గృహములు కలవు. శత్రువులపై నెత్తిన నరస భూవరు కృపాణములో తాపిన 'మహా మరకత, పుష్యరాగ నవ మౌక్తిక విద్రుమ నీలకాంతిచే! సురపదవీథి జనులు చూడ్కి కభిత్తిక చిత్రకర్మముల్ 'గా' ప్రదీప్తములైనవి. మణి సాలభంజికలు, ప్రాచిరాజవంశ స్థిర రత్న స్తంభములు, స్ఫటికంపు బొమ్మలు నాటి శిల్పకళా వైశిష్ట్య ప్రకాశములు. 'గురు నఖదళి ప్రతిమా; కరి చిత్రిత భిత్తికలిత ఘ మణిపీఠా, పరితోష యుతము లైన యరిపురములు గినుక మాను హారుల

(తరువాయి 16 వ పేజీలో)

# ప్రాచీనాంధ్ర కావ్యములలో సూర్యోదయము

– శ్రీమతి వి నాగరాజ్యలక్ష్మి ఎం. ఏ.

'వన జలకేళి రవి శశి
తనయోదయ మంత్రగతి రతి క్షితిప రణాం
బునిధి మధు ఋతు పురోద్యా
నగ విరహ దూత్యవర్ణనాష్టాదశమున్'.

— కు. సం 1-44 ప

పై అష్టాదశ కావ్యవర్ణనలలో ప్రకృతివర్ణనలకు సాహిత్యములో ప్రత్యేకస్థానము కలదు. మానవ కల్పితముకాని ప్రకృతి నవనవోన్మేషము. నిత్యోత్సవనవ్యము. స్వీయానుభవమును అక్షర రూపములో లోకమునకు పంచిపెట్టు కవులకు ప్రకృతి నిత్యోపాసనా దైవము. 'ప్రకృతి ప్రణేతల్ కవుల్' అను నార్యోక్తి ప్రసిద్ధము. అందు సూర్యోదయ వర్ణన మొకటి. వేగుచుక్క మొదలుకొని అరుణోదయము వరకు వర్ణించుట సూర్యోదయ వర్ణనగా పరిగణింపబడినది. విన్నకోట పెద్దన 'కావ్యాలంకార చూడామణి'లో ఇందు వర్ణింపవలసిన యంశముల నిట్లు నుడివెను.

'ఎచ్చటఁ జూచిన జగమున
నచ్చటన వెలుంగుననియు నజహరిహరతా
సచ్చతురుఁ డనియుఁ మరియును
నిచ్చలు దగఁ బొగడవలయు నిను
డుదయంబున్.'

-కావ్యాలంకార చూడామణి. 3-118ప.

ప్రకృతివర్ణనలు ఋగ్వేదమునుండియు కానవచ్చుచున్నవి. అందలి ఉషోవర్ణనము సహృదయ హృదయాహ్లాదకరము. 'ఉషస్సు స్వర్గభూ దేవతల సంతానము. ఆ తలిదండ్రుల ఒడిలో పవళించిన ఉషఃకన్య వారిద్దరిపై కాంతిపుంజమును ప్రసరింపజేయుచున్నది. సూర్యభగవానుని వధువు సౌదామినీ సమూహమువలె ఆమె ప్రపంచమునే తేజోవంతముగ చేయును' వేదమున గావింపబడిన వర్ణన ఉషస్సు యొక్క మనోజ్ఞరూపమును ప్రత్యక్షము గావించును.

కథా సన్నివేశమునకు పోషకముగా వర్ణితములగు నీ ప్రకృతివర్ణనలకు ఆంధ్రప్రబంధ కవులొక విశిష్టరూపము నిచ్చిరి. కొన్ని ప్రాచీన కావ్యములలోని సూర్యోదయ వర్ణనలలోగల సౌందర్యమును పరికింతము.

తెలుఁగున కాదికావ్యమైన భారతము విరాటపర్వములోని కీచకవధ ఘట్టమున సూర్యోదయ వర్ణన చేయబడినది. ద్రౌపది కీచకునిచే నవమానితయైన పిమ్మట నీ వర్ణన కానవచ్చును.

'ద్రుపద నందన పరిభవదుఃఖమునకు
నుల్లమున దురపిల్లుచు నున్న సరసి
వేఁడి నిట్టూర్పులో యన వెడలెఁ గ్రొత్త
తావి మూతులు విచ్చు నెత్తమ్మి విరుల'

— భార. విరా. 2-296 ప.

ద్రౌపది భీమసేనునికి తన యవమానమును తెల్పి తన నిద్రించు చోటకు పోయి కనుదోయి మొగిడ్చి యుండగా ప్రభాతమైనది. అప్పుడు ద్రౌపదికి జరిగిన యవమానమునకు చింతిల్లుచున్న సరోవరము యొక్క నిట్టూర్పులో యనునట్లుగా క్రొత్తగా వికసించిన పద్మములనుండి పరిమళము వెడలిన దట. ఇట్లు కథకు అతుకు నట్లు వర్ణన చేయుటలో తిక్కన మిక్కిలి నేర్పరి. అనంతరము ప్రభాతము నందలి సర్వాంగశోభను తిక్కన విస్తరముగ వర్ణించెను.

'రాలియున్న పుష్ప ప్రకరము విడిచి
చెన్నుగా నున్న సేసిన సెజ్జయనఁగ
వేగుటయుఁ జుక్కలన్నియు విరిసి విశద
భాతిఁ జెలువొందుఁ జూడ నంబర
తలంబు' భార. విరా. 39 ప.

ఇందలి భావము సహజ రమణీయము. ఈ సందర్భమునందలిదేయైన నీరజాకరములు నిద్ర మేఁ జేసిన ' అను పద్యములో 'హరిహరబ్రహ్మ మహానుభావంబు లొక్కటిగాఁ గరఁగిన గట్టి యనఁగ' అను పాదములో హరిహర బ్రహ్మైక్యమును కూడ సూచించినాడు.

నన్నెచోడుడు 'కుమారసంభవము' న అష్టాదశ వర్ణనలను గావించెను. అష్టమాశ్వాసమున పండ్రెండు పద్యములలో సూర్యోదయవర్ణన మొనర్పబడినది.

ప్రభాత సమీరణ మాపురి సురత శ్రమాకుల వనితల ఘర్మకణావినోదియై వీచెను. ఇనుఁడు నిజదీప్తిని దీపకళికల నుండి తిరిగి తీసికొనగా దీపకళికలు తెల్లనైనవి.

'అస్తగిరి బొందె రాజు దయాద్రి నెక్కె
నినుఁడు తేజస్వులగువారి కెల్ల ప్రొద్దు
మానికం బగు నిల నొక్కమాటపొందు
హానివృద్ధులు సూచించునట్లువోలె'

– కుమారసంభవము 8-90 ప

ఈ పద్యమా సందర్భములో పేర్కొనదగినది. మఱియు హరువివాహమునకు అసురశత్రుడై జగమెల్ల వసుమయము గావించినట్లు చిత్రభానుడు వసుధయెల్ల వసుసమూహముచేఁ గప్పెను అని వర్ణించి ప్రకృతాంశము ననుసంధించినాడు.

శివకవి శ్రేష్ఠుడైన పాల్కురికి సోమన 'పండితారాధ్య చరిత్ర'లో అతి సామాన్యముగ తృణీకరింపఁబడు వానిని గూడ నిశితముగా పరిశీలించి అద్భుతముగ వర్ణించి యుండెను. తెలతెలవారుచుండగా కోడికూయుట నిట్లు వర్ణించెను.

'తొలికోడి కనువిచ్చి నిలిచి మైపెంచి
జలజల ఱెక్కలు నడలించి నీల్గి

(సశేషము)

(13 వ పేజీ తరువాయి)

నృసింహః. సౌధభిత్తికలపైన ఏనుగు చిత్తరువుల కుంభస్థలాలను పగులగొట్టగా ముత్యములు రాలగానపుడు శత్రునగర సింహాలు కిమ్మనక మానినవి. ఏనుగుకుంభస్థలములలో ముత్యములనుంచి చెక్కిన మనవారి శిల్పకళా ప్రౌఢవానికి దీటు లేదు కదా!

ప్రక్కన గాలించి కంఠంబు విక్క
ముక్కున నీకలు నక్కల్చి కడుపు
నెక్కించి మెడసాచి నిక్కి మిన్ చూచి.

పండితారాధ్య చరిత్ర.
పురాతన ప్రకరణము.

ఎఱ్ఱన 'నృసింహ పురాణము'లోని సూర్యోదయ వర్ణన రమ్యము. రాత్రి యెల్ల సముద్రతీరతియందుండు సాక్షివ చంద్రుడు పశ్చిమాబ్ధికొయ్యన తలసుప్తి దిగజారెను. సూర్యుని రాకను పూర్వ కాంగన గృహాంగణమున కుంకుమోదక సేక మొనర్చినట్లు నవారుణోదయ మొప్పెను. అప్పుడు

'అనితరకాంతఁ బద్మినిఁ బ్రి
యాతిలకంబు మెఱింగి పోయి రే
యెనసిన వేడ్క నొందు దన
యిచ్చ మెయిన్విహరించి మేన నం
టిన నవరాగలీల జిగి
దేరఁగ నోడి యొదింగి యొయ్యనో
య్యనఁ బొడచూపెనా నుదయ
మయ్యె బతంగుడుం బ్రాఙ్ముఖమ్మునన్.

నృ. పు. 3-116 ప.

అను పద్యమునందలి సూర్యోదయము కరము సుమనోహరము.

సంస్కృత పురాణ రీతిని కావ్యత్వ మునఁగ మార్చుటకు శ్రీనాథునకు కాశీ ఖండమున నుపకరించిన వానిలో సూర్యోదయ వర్ణన మొకటి. వింధ్యపర్వతము మేరువుపై మత్సరము పెరుగ 'దర్పోద్ధురవ్యవసాయోద్భవ భంగి . ప్రబద్ధోర్ధ్వాంగంబు నవరోధించిన' సందర్భమున నీవర్ణన కావింపబడినది. మయూరుని 'సూర్య శతకము' లోని శ్లోకముల కాంధ్రీకరణమే యైనను చక్కని సీస పద్యముల శైలితో నావర్ణనను సార్థక మొనరించినాడు. మచ్చునకొక పద్యము

చిఱుసాన ఒట్టించి ఒకిలి పేయించిన
గండ్రగొడ్డలి నిశా గహనలతకుఁ
గారుకొన్న నిబిడాంధకారధారాచ్ఛట
సత్త్రి వాటికి వీతిహోత్ర జిహ్వ
నక్షత్ర కుముద కాననము గిల్లెడుపాంసె
ప్రాచియెత్తిన హస్త పల్లవాగ్ర
మరని మింటికి మంటి నైక్యసందేహంబు
బరిహరింపంగఁ బాల్పడ్డ యవధి
సృష్టి కట్టెఱ తొలుసంజ చెలిమికాడు
కుంటి వినతామహాదేవి కొడుకుఁగుఱ్ఱ
సవితృ సారథి కట్టెఱచాయ వేలు
పరుణు డుదయించె ప్రాగ్దిశాభ్యంతర
మున'

కాశీ. 1-121 ప.

పోతనార్యుడు 'భాగవతము'న పద్య గద్యములలో ననేక వర్ణనలను గావించెను. అతని వర్ణనలు విశదములు, సమగ్రములు. కంసుని సంహరించుటకు కృష్ణుడు బలరామ సహితుడై యరిగిన సందర్భమున చంద్రోదయ సూర్యోదయ వర్ణన లున్నవి.

'పౌలోమి దనబాలు పాన్పుపైఁగనుపట్టఁ
బన్నిన పవడంపు బంతి యనఁగ
నాయురర్థముల క్షయంబు లొత్తిలిచాటు
కాలజాంఘికు చేతి ఘంట యనఁగ
ఘనజంతు జీవిత కాలరాసుల కొలఁది
కొలుచ నెత్తిన హేమ కుంభ మనఁగఁ
బశ్చిమ దిక్కాంత పరఁగఁ గైసేయుచో
ముందట నిడు కొన్న ముకుర మనఁగఁ
గోక తాపోపశమ దివ్య ఘుటిక యనఁగఁ
బద్మినీ కాంత నోముల ఫలమనంగ
మూఁడు మూర్తుల సారంపు ముద్దయనఁగ
మిహిరమండలముదయాద్రిమీఁద నొప్పె

భాగ. దశ. 1304 ప.

ఇంకను తమము బిలములందు దాగినదనియు, తుమ్మెదలు పద్మమరందములు మెచ్చగా పంకేరుహగర్భాండము కుంకుమ సలిలము గ్రోలి కొమరొప్పెననియు వర్ణించెను. పోతన సహజ పాండిత్య ప్రకర్ష ఇందు ద్యోతక మగుచున్నది

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు 'శృంగార శాకుంతలము' లో సూర్యోదయమును దుష్యంతుని కనుకూలించునట్లు చెను.

'ఱంకిలి లేక చందిరకు
లాగ్రణి నేడు శకుంతలామన
శ్శంకరుఁ డయ్యెడుం గలుగు
కాత్రవ మాతనితోడ నంచు మీ
నాంకున కంగరక్షకయి
యామిని తేఁడొనరించి నట్టియా
మం కెనపూవు కేడె మన
మందల యొప్పె మరీచి మాలికన్

శృం. శా. 3-20

ఇందు ప్రకృతి దుష్యంతునియెడ భూతిని చూపినట్లు వర్ణింపబడినది.

'రుక్మాంగద చరిత్ర' లో ప్రౌ
మల్లన చేసిన సూర్యోదయ వర్ణన
మనోహరము. మలయానిలుడు
దినితో రాత్రిగూడిన భృంగవల్ల
తోడ్కొని పద్మినికై తెచ్చి పా
ల్కను తీర్చిన సఖునివలె ప్రి
ప్రియాంగనతో కూర్చెనట. మఱియు

'కిరణంబులొక కొన్ని తరుషండము
రు
నలరు పల్లవ భాతి నలరుచుండఁ
ప్రభలొక్క కొన్ని గోత్రమహీ ధ
ధాతుబల స్ఫూర్తిఁ దనరుచుండ
నంశువులొక కొన్ని హరివంత క
సిందూర పద్మక శ్రీలఁ దనర
గుచులొక కొన్ని చారు సముద్రము
రు
విద్రుమావళి రీతి విస్తరిల్లఁ
గరము లొక కొన్ని సౌభాగ్యకరణ
ల
భూనభోభాగ పరిపూర్ణ భూతి మహి
జూడనొప్పారె బుధజనస్తుతులు చెల
ప్రాజ్ఞగాగ్రంబుపైఁ దోచె
భాస్కరుం

-రుక్మాం 3-1

అను పద్యము సూర్యోదయ వర్ణ
నుదాహరింపదగిన పద్యము.

ఆంధ్రకవితా పితామహుడు పెద్దన 'ప్రత్యూష పవనాంకురములు పైకొను వేళ'ను వర్ణించినతీరు రసవంతము. తామరలను మొగ్గ పెట్టి పెట్టి యళులు బయల్వెడలెను. ప్రాగ్భూమి భృత్త్రికత వేతర బాహాగ్రపు సంగడం బనగా మార్తాండుడు తోచెను. రాత్రి అంతయు వియోగము ననుభవించిన చక్రవాకములు కలసికొనినవెంటనే అవిచేయు చేష్టలిట్లు వర్ణితములు

'కోలకోలఁ గూయుఁ జైనొలుకుఁ
గుత్తుకఁగుత్తుకఁ జుట్టుఁబాలుచి
ల్వాలక్రియఁ గానరాని గతు
లన్ మయిమైఁ బెనఁచున్ జనించున
క్రులాయత నొత్తు సోలు నిలు
చున్ విధి చాతురిఁగూడియున్ రతిం
దలఁపవు కంటి వాసిన వె
తల్ డలపించుచుఁ గోకదంపతుల్.'

మను. 3-62 ప.

ఇందు ప్రభాతకాలపు సన్నివేశము ప్రత్యక్షము కావింపబడినది. రాత్రంతయు విరహ వేదన ననుభవించిన వరూథినిని తలపించుచు నిందలి వర్ణన యొప్పినది.

'పారిజాతాపహరణము' న సత్యతో మురారి వైజయంతమున సుఖనిద్రాలోలుడై యుండగా ప్రభాతమైనది. శృంగార విలాసములకు తావైన ఘట్టమున వర్ణించిన పిదప వర్ణించు ఘట్టముగాన కవి యిందును శృంగార చేష్టలను వ్యక్తీకరించెను.

'మొగుడు తమ్ములఁ జిక్కి మగ తేఁటి
యలు గలు
సడలిపోఁ జేయు విశల్యకరణి
కాలవశంబునఁ గడచన్న వాసర
శ్రీఁ గ్రమ్మతించు సంజీవకరణి
రేయను వాలునఁ బాయులైన రథాంగ
తతుల హత్తించు సంధానకరణి
తిమిరంబుచే సొంపు సమసినదిశలకు
వన్నియనొసగు సౌవర్ణకరణి
మించు బీరెండ యగ్నిఁ బుట్టించు సరణి
కలుష ఘోరపయోరాశిఁ గడపుతరణి
తోఁచెఁ బ్రాచీమహీధరోత్తుంగ సరణిఁ
బ్రాఁజసువు మానికంబుల బరణి తరణి.

పారి. 4-49 ప.

రామరాజ భూషణుని 'వసుచరిత్రము' నందు సూర్యోదయవర్ణన మీరీతి నున్నది. నాయిక హృదయ మరవిందము కాన వసురాజు కరోర్మిక తోరపు రుచితో తోడ్పడవచ్చెను.

'అపు డరవింద గంధి హృద
యాంబుజ ఖేద మడంప వచ్చితో
రపురుచితో వెలుంగు వసు
రాజు కరోర్మికఁ గాంచి భీతిమై
జపల విలోచనం బొదుగ
జాలక తారభటాలితో నిశా
ధిపుని బలంబు లేగిన గ
తిన్ రహిపీడెను బాండు చంద్రికల్.

- వసు. 4.125 ప.

రామరాజ భూషణుడిందు వసురాజునకు సూర్యునకు శ్లేషను కల్పించి 'శ్లేషయమక చక్రవర్తి' యను తన బిరుదమును వర్ణనలో కూడ సార్థక మొనర్చుకొనెను.

'కళాపూర్ణోదయము' లో అంగరాజు యుద్ధసన్నద్ధుడైన వెంటనే సూర్యోదయము వర్ణింపబడినది.

'మిళిత భూగగనాంతముల సంగు విచ్చిన
గాన్పించు బ్రహ్మాండ కాంతి యనగ
దిశలెన్ను చిదిపూర్వ దిశయని బ్రహ్మావి
ల్పినయట్టి మొదలిటి లెక్క యనఁగ
నుదయాచలాధీశు నుత్తమాంగంబున
భాసిల్లు పొంబట్టుపాగ యనఁగ
గగనాఖ్య పనస వృక్ష ప్రకాండోపరి
భ్రాజితంబగు పక్వఫల మనంగఁ
దారకా భర్తృ చంద్రికాక్షీర భోజ
నాంతమునఁ బూర్వ సంధ్యయ న్యాకాంత
వెలచి
లీలఁ జేర్చిన పసిడి పళ్ళెరమనంగఁ
దరణి విశ్వంబు గాన్పించె వరుసతోడ.'

- కళా. 8-35.

ఇందలి భావము వినూత్న రమణీయము. పింగళి సూరన విరచితమైన 'ప్రభావతీ ప్రద్యుమ్నము'లో గాంధర్వ వివాహానంతరము సూర్యోదయము వర్ణింపబడినది. ఉదయరాగ వర్ణన మిక్కిలి హృద్యము. పూర్వము నరికి వేయబడిన పగలు అను చెట్టు మరల చిగురించిన చిగురు అనునట్లుగ నరుణోదయ దీప్తి మెఱసెనని ఈతని కల్పన. కథలో ప్రభావతీ ప్రద్యుమ్నులు ప్రణయ కలహమును బొంది తిరిగి కలియుటకిది సూచన.

'కాళహస్తి మాహాత్మ్యము' లో ధూర్జటి కథాగతికి తోడ్పడునట్లు సూర్యోదయమును వర్ణించియుండెను.

'పన్నగంబు గజము బలమునఁ జలమునఁ
పోరుటెట్లో శివునిఁ బొందుటెట్లో
చూడవలయు ననుచు వేడుకతో వచ్చు
కరణి నంతఁ దోఁచెఁ గర్మసాక్షి.'

-కా. మా. 2-138 ప.

నిత్యము శివపూజసేయు శ్రీ కాళము, హస్తి, తమ పూజలకు భంగము కలుగుటచే నాదినము పరస్పరము పోరాటమునకు సిద్ధపడెను. జంతువులైన అవి రెండును ఏవిధముగ పోరునో ఎట్లు శివ సాన్నిధ్యమును పొందునో చూతమను నుత్సుకతతో నుదయించెనట సూర్యుడు. ఇచటి 'కర్మసాక్షి' అను విశేషణము అర్థవంతము. ఇంకను అనేకములైన పేర్కొనదగిన సూర్యోదయ వర్ణనలు కలవు.

ఇట్టి సూర్యోదయ వర్ణనము ప్రాచీనాంధ్ర కావ్యములలో పలుతావుల పలువిధముల భాసిల్లుచున్నది.

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డ పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతిలేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జే. కాలేజి,

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B V. & Co, Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.